   

# మంచివాళ్లకు మంచివాడు



**కృష్ణ** సమర్పించు

శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ పిక్చర్స్

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం
**కె.యస్.ఆర్.దాస**

నిర్మాత
**యస్.భావనారాయణ**

డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ వి యస్ ఆర్ స్వామి W.I.C.A. సంగీతం సత్యం

ఆంధ్ర పూర్ణా పిక్చర్స్ సీడెడ్ నవభారత్ ఫిలిమ్సు నైజాం శ్రీ తారకరామ ఫిలిమ్స్ మైసూరు విజయపిక్చర్స్ సర్క్యూట్

NVKR




# క్రొత్త త్రివిధోపయుక్తమైన డెట్

క్రొత్త డెట్ హెచ్చు తెల్లని పొడరు— వస్తువులను తెల్లగా ఉతుకుటకు మేలు రకపు తెలుపుచేసే పదార్థము కలది.

క్రొత్త డెట్‌కు అదనముగా శుభ్రపరచే శక్తి ఉంది. అంటివున్న మట్టిని కూడ వదిలించి, రంగు బట్టలను అత్యంత ప్రకాశవంతముగా చేస్తుంది.

క్రొత్త డెట్‌లో సమృద్ధిగా నురుగు వచ్చే పదార్థముంది. అది బట్టలకు ఎంతో నిరపాయమైనది, చేతులకు ఎంతో మృదువుగా ఉంటుంది!

క్రొత్త సైజులు: డెట్ 200, 400, 600, 800, 1000 ప్యాకెట్టులు మరియు డెట్ సంచీ.




ఇంకొక నాణ్యమైన డెట్ తయారు




**డెట్** బిళ్ల

సబ్బు కంటె 1½ రెట్లు ఎక్కువ బట్టలను ఉతుకుతుంది, పూర్వము ఎప్పటి కంటె అతి తెల్లగా—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లలో.

Shilpi HPMA 42A/72 tel

# ఉత్తరాలు

### ఎందుకు?

అవినీతి, ఉన్నతాధికారాలలో ఉన్నవారి బంధు ప్రీతి అందరికీ తెలిసినవే. చేసేదిలేక వాటిని సహించి ఊరుకుంటున్నారు జనం. అందుకని, బంధువులు పుచ్చుకోవచ్చునని, పెద్ద పదవులలో వున్నవారి చుట్టాలకి ఉద్యోగాలు కేటాయించాలని—పార్లమెంటులో బిల్లు పెడితే ఎలాగ సహిస్తారు? 'సిఫారసు ఉత్తరంతో చేరితే ఊరుకుంటారు. బిల్లు ప్రభావంతో చేరరాదంటారు ఎందుకు?' అని అడిగితే ఎవరేమి చెప్పగలరు?

ఆర్. గంటి (మదరాసు)

* * *

మీ పత్రికలో సన్యాసిరావు మరియు బొబ్బిలి విద్యార్థులు వ్రాసిన పద్యాలు చూసాక ఆంధ్రులు బలవంతంగా ఎలా సమైక్యతకు వొట్టి కల్లబొల్లి మాటలతో మోసం చేసారో ఒక్కసారి గుర్తుకొచ్చి మీ పత్రిక తెలుగువారిదా లేక ఆంధ్రుల మోసానికి ఒక పునాదా అన్న సంశయం వొచ్చి యీ క్రింది పద్య రాయకుండ ఉండలేను.

బలవంతగ వద్దన!
కల్లబొల్లి మాటలతో!
ఆంధ్రప్రదేశ్ అవతరణకి!
ఆంధ్రులు కారణమై
మోసానికి పున్నాదైగా
అందుకొన్నారు ఆంధ్రులు!
దోపిడీ చేసారు
తెలంగాణాలో!
ఉద్యోగాలు, ప్రమోషన్లు!
అన్నిటిలో కూర్చున్నారు
మీకేమి లేదన్నారు!

విద్యార్థులు సమ్మె చేస్తే
పోలీసులు లాఠీలతో

కొట్టారు, కాల్పులు
చేసారు, చచ్చారు ఒకటి రెండు కాదు
మూడు వందలమంది అర్పించారు
తమ ప్రాణాలు!
తెలంగాణా ప్రాంతములో
ఆంధ్రుల విద్యార్థులకు రిజర్వేషన్లు,
ఆంధ్రప్రాంతంలో తెలంగాణావారికి సున్నా
యేడుస్తున్నా ఆంధ్రులు
న్యాయం గెలిసిందని
నిజం నిలకడ యున్నట్లు
తీర్పు యిచ్చింది సుప్రీంకోర్టు
కావున యెత్తండి తెలంగాణా ప్రజలారా!
దివ్విటీలు యెత్తండి
తెలంగాణా మాతకే జేజేలు!
తెలంగాణా వస్తుంది!
తెలంగాణా తప్పక యిస్తుంది!
ఇంద్రగాంధి ఇంకెవరైన కాని!

పై పద్యము తప్పకుండ వేయవలెను తప్పులున్న సరివేయకపోతిరో మీకు మా ఆంధ్రుల ధైర్యము, శక్తి లేదని రుజువు వరుస్తుంది.

ఇట్లు మీ పత్రికకి పాఠకుడు

పుట్టా కుశలేంద్రరావు,

194, మారేడుపల్లి, సికింద్రాబాదు.

### ఓ నాయకీ...!

నాయకీ! శుభదాయకీ!
జేజేలు మహాజ్ఞాతకీ!
(అని పొగిడే వారేరి?)

అలికి ముగ్గుకి దేవద్దం అత్తగారి కొన్నట్లు
మాకు కొన్నుకోని సేమి క్షేదరులా
అన్నదమ్ములు మీరు
ఆణిముత్యాలా!!
నేను 'మంథర'ను కాను
'ఇందిర'ను సుమా!
అందుచేతను
ఆంధ్రులారా!
అని అంధ్రతో
గాయజాలము లడుతున్నావో! నాయకీ!!
నెయిలోని పాదరసం నేలపాలయినది
ధరణి పాలయిన వాటిని ఏరి కూర్చి కలుపు
దామని చూస్తున్నావు.
వాటిని కూర్చి కలిపే గొప్పన ఎన్ని రేణువులు
నీ హదాంత్రి కింద నలిగి మాంసపు ముద్దలగు
చున్నవో?
నీ కూర్పు కార్యక్రమంలో
కడతేర్పుతున్న ప్రాణాల
ఆక్రోశనలు,
ఆక్రందనలు
వినపడట్లేదా??
తెగిన వెలియలికట్ల
గుండుదెబ్బ,
గుండె దెబ్బ,
స్రవించు రక్తం,
పడిలిన జూలం
ఉరుకు లిడు
అంబుధి అలా,
యువక రక్తం
రెచ్చగొట్టిన
ఆవేదనని
ఒక్కలాంటిని సుమా!!!

—బండారు రామ్‌ప్రసాదరావు, (విశాఖపట్నం)

* * *

# ప్రపంచ జూడో ఛాంపియన్ తన శిక్షణ రహస్యాన్ని వెల్లడిస్తున్నాడు

## క్రొత్త వ్యాయామసాధనం కేవలం రోజుకు 5 నిమిషాలలోనే ఛాంపియన్ కండలు పెంచింది.

ఆంస్టర్‌డాం: ప్రపంచ హెవీ వెయిట్ జూడో ఛాంపియన్ విం రస్కా, తన శిక్షణ 'రహస్యం'—ఒక అద్భుతమైన నవీన వ్యాయామసాధనం బుల్‌వర్కర్ 2 అని తెలియ చేశాడు. ఇదిగో అతను మాకు వ్రాసిన లేఖ:

"ప్రియమైన అయ్యలారా,

మీరు జూడోలో పాల్గొనదలచేనంటే, మీ కండరములు శక్తివంతములై, దృఢముగా ఉండాలి. అందుకోసమే నేను ప్రతిరోజు బుల్‌వర్కర్ తో పని చేస్తాను. అది నిజంగా అద్భుతమైన కండలు పెంపొందిస్తుంది, మరియు చెప్పుకోతగ్గ సత్యమేమంటే కేవలం రోజుకు 5 నిమిషాలలో బుల్‌వర్కర్ అతిక్లిష్టమైన పోటీలలో పాల్గొను నాకు ఉత్కృష్టమైన పద్ధతిలో విజయం చేకూరుటకు అవసరమైన అదనపు బలము మరియు సహనశీలత నాకు లభింప చేసింది. నేను నా విజయములో అధికభాగము ఈ సంభ్రమ జనకమైన పరస్పర వ్యాయామ పద్ధతికి ఋణ పడి ఉంది. ఎవరైనా సరే ఆటగాడైనా కాక పోయినా జీవన విజేత కావాలనుకొంటే వారికి బుల్‌వర్కర్‌ను మనస్ఫూర్తిగా సిఫారసు చేస్తున్నాను

మీ విధేయుడు

(signature)

విం రస్కా

ప్రపంచ ఛాంపియను బ్లాక్ బెల్ట్ జూడో."

కేవలం రోజుకు 5 నిమిషాలే చాలు మీరు బలిష్ఠమైన కండలు పెంచుటకు, భుజములు వెడల్పు చేయుటకు, పొట్ట చక్కగా తగ్గించుటకు, మీరు శక్తివంతుల వలె ఆరోగ్యంగా, ఉత్సాహంతో పొంగులు వారేటట్లు చేయుటకు, ఆ అనుభూతి పొందుటకు, మరియొక

బుల్‌వర్కర్ గురించి మిగతా ఛాంపియన్లు ంద ఆమోదముద్ర వేశారు ఎవరంటే వెనుకటి హెవీ వెయిట్ ఛాంపియను కేసియస్ క్లే, మూడు సార్లు ఇంగ్లీషు వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియను జార్జ్ పెట్రిక్ ప్రపంచ సైక్లింగ్ ఛాంపియను ఎడి మెర్క్స్ మరియు అనేక స్పోర్ట్స్ డాక్టర్లు, శిక్షకులు మరియు బోధకులు.

ఛాంపియన్ కేసియస్ క్లే అంటారు: "బుల్‌వర్కరు వ్యాయామములో ఉండే చమటను, కష్టమును లేకుండా చేస్తుంది మరియు అది నిజంగా పని చేస్తుంది!"

**రెండు వారాలలోనే ఫలితాలకు గ్యారంటీ!**

మరి కేవలం రెండు వారాల శిక్షణ అనంతరం మీరు స్వయంగా మీ అభివృద్ధిని టేపుతో కొలిచి కొన లేక పోతే, స్వయంగా ఫలితాలు అద్దంలో చూచుకొనలేకపోతే—మీరేమీ చెల్లింప వద్దు. బుల్‌వర్కర్ తో మీ శక్తి ప్రతివారమునకు 4% చొప్పున అధిక మగునట్లు గ్యారంటీ ఛాంపియన్లందరూ ప్రశంసించిన అద్భుతమైన ఈ క్రొత్త శిక్షణ కార్యక్రమము గురించి చేసి చూపుతున్న ఫోటోలు కల పూర్తి వివరములతో వున్న ఉచిత ప్రోచరు అందుకొనుటకై నేడే ఈ కూపను పంపించండి

### అన్ని వయస్సులలోని పురుషులూ అద్భుతమైన ఫలితాలు పొందినారు

"ఒక్క నెలలోనే నా శరీరములోని ప్రతిభాగమూ 1.3 సెం. మీ నుండి 2.6 సెం. మీ వరకు పెంచా. ఛాతీ 5.2 సెంమీ పెంచాను. బుల్‌వర్కర్ అత్యద్భుతం!"

జి.టి. (కాలింపాంగ్)

"బుల్‌వర్కర్ వలన ఫలితాలు నిజంగా ఊపేస్తాయి. ఒక్క వారానికే నేనెంతో బలంగా ఉండే భావన కలిగింది. మరియు అది వ్యాయామ కాలాన్ని అవసరమే లేనంత తక్కువగా చేసింది"

ఎస్. ఆర్ (మద్రాసు)

"బుల్‌వర్కర్ కొనవలెనని నేను నిర్ణయం నిజంగా నా జీవితంలో నేను తీసుకొన్న అతి ముఖ్యమైన నిర్ణయములలో ఒకటి"

కె.యం.ఆర్ (క్విలన్)

"బుల్‌వర్కర్ నాకు చాలా లాభదాయకమైనది నా వయస్సు 65 సంవత్సరాలు"

డి.యం.వి (రావ్ నగర్)

© Mail Order Sales Pvt. Ltd., 15 Mathew Road, Near Opera House, Bombay 4.

**ఉచితం**

10/21 Tel

నాకు బుల్‌వర్కర్ శిక్షణ కార్యక్రమము గురించి వ్యాయామము చేసి చూపుతున్న ఫోటోలు గల వివరములతో కూడిన పూర్తి సమాచారము గల ప్రోచరు తిరుగుటపాలో పంపించండి.

పేరు ..............................

చిరునామా ..............................

.............................. వయస్సు ....

**BULLWORKER SERVICE 15 Mathew Road, Near Opera House, Bombay 4**

దయయుంచి మా అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి

S W 14

## వ్యాసాలు

26—1—73 పత్రికలో జగిత్యాల సోదరుని వ్రాసిన ఉత్తరం చూచాక ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది

ఈ పత్రిక కేవలం ఆంధ్రులదా? తెలుగుభాష వారిదా? అని ప్రశ్నించారు ఈ ఉత్తరము చదువుతుంటే ఒక ప్రక్క ఆవేదన, ఒక ప్రక్క నవ్వు పుట్టించింది

అసలు ఈ పత్రిక ఆంధ్రులది అని, తెలంగాణా వారిది అనే సందేహం ఎందుకు వచ్చిందో అసలు అర్థం కావటం లేదు

ఈ పత్రిక ఆంధ్రులవరకే పరిమితం చేటట్లు అయితే మరి తెలంగాణా సోదరులు ఉత్తరాలను ఎందుకు ప్రచురిస్తున్నారు అంతదాకా ఎందుకు ఇది ఆంధ్రులకు సంబంధించే పత్రికే అయితే, మరి మీ ఉత్తరాన్ని ఎందుకు ప్రచురించుతారు?

ఒక్కొక్కప్పుడు మేము నాలుగు అయిదు ఉత్తరాలు వ్రాసినా ఒక్క ఉత్తరం ప్రచురితం కాలేదు. కాని అప్పుడు, ఇతర రాష్ట్రాల వారు వ్రాసిన ఉత్తరాలే ఎక్కువగ వున్నాయి అంత మాత్రం చేత ఇది మా పత్రిక కాదు. మా ఉత్తరాలు ప్రచురించటం లేదు.' అని 'జాగ్రత్తగా ఉండండి అని ఇటువంటి ఉత్తరాలు వ్రాసినంత మాత్రాన ఏమైనా లాభం ఉంది?

వారి కార్యాలయానికి చేరిన ఉత్తరాలను ప్రచురించటానికి యోగ్యమైనవిగా వున్న ఉత్తరాలను ఇటు ఆంధ్ర అటు తెలంగాణా వారివి ఇద్దరివి ప్రచురిస్తున్నారుగదా? అటువంటి అప్పుడు ఈ భేద భావాల ఎందుకు కల్పిస్తున్నారు?

ఎవరి అభిప్రాయాలను వారు పత్రికాముఖంగా చెప్పుకుంటున్నారు మా యొక్క ఉద్దేశ్యాలకు సంపాదకుల వేయగాల నిస్తున్నారు అంతేకాని వారు ప్రత్యేకించి, ఆంధ్రులను గురించిగాని వారు వ్రాసిన ఉత్తరాలుగా ప్రచురించితే గాదా ఉత్తరాలు విషయాలలోగాని, మరి ఇంకే విషయంలో నయినా చూచారా తెలంగాణా వారిపట్ల చిన్నచూపు చూపుతున్నారు కాబట్టి ఆంధ్రుల పత్రికే అని చెప్పగలం

కాక పోతే, రాజకీయ రంగంలో అన్యాయం జరుగుతున్నది ఆంధ్రకు ఇక్కడ ఇంత మారణ హోమం జరుగుతున్నా, వారి కష్టాలను, కనీసం వారి బాధలను కూడ వినిపించుకోకుండా చివరికి వారికి నాలుగు సానుభూతి వాక్యాలు కూడానోచుకోలేక పోయారు ఆంధ్రా నుంచి ఎన్నికయి సమైక్యతా వాదులమని చెప్పుకునే మా మంత్రిపుంగవుల ఎంచి.

అక్కడ ఏ శిగదులలో ఉండి ఇక్కడ ఏం జరుగుతుందో కూడా తెలియలేని స్థితిలో ఉన్నారు మా పెద్ద మనుష్యులు.

అంత మాత్రానికే ఇది కేవలం ఆంధ్రులపత్రిక ఈ పత్రిక తెలుగుభాష మాట్లాడే వారిది. మరొక సారి, ఇలా ప్రచురించకూడదు అనటం ఏంసబబు!! చేతనయితే మీరుకూడా ఉత్తరాల ద్వారానో మరింకే

## ఉత్తరాలు

విధంగా అయినా మీ అభిప్రాయాలను వెల్లడించండి అంతేగాని అటువంటి బెదిరింపు ఉత్తరాల వల్ల ఇవతల చదివే వారి మనస్సులు బాధపడతాయేగాని, అంత ఇంటరెస్ట్ చూపరు అనుకుంటాను

—కొంగర ఉమా మహేశ్వరరావు, (తెనాలి)

* * *

ఇటీవలి అనేక సంచికల్లో తెలంగాణ ప్రాంతం వాళ్లని కించపరిచే, రెచ్చగొట్టే—రాతలు చూచిన తర్వాత ఈ వాక్యాలు రాయలేకుండ వుండలేను ఆది నుంచీ ఆవేశకావేషాలకు లోనుగాకుండా, Balanced గా వుంటుందన్న మంచిపేర 'ఆంధ్రపత్రిక'కున్నది అంతేగాక అసంఖ్యాక పాఠకులు అభిమానులూ ఈ ప్రాంతంలోనూ వున్నారన్న సంగతి విస్మరించి వాళ్ల సెంటిమెంట్స్‌నీ, ఫీలింగ్స్‌నీ—తీవ్రంగా గాయపరచేలా వుండే రాతలకి తావియడం మంచిది కాదేమో!

మచ్చుకి కొన్ని ఉదాహరణలు తే 29 12 72 సంచికలో ఉత్తరాలు (వ్యాసాలు) శీర్షిక క్రింద శ్రీ సారంగమోహనరావు (కోట) గారి 'కానీ . ప్రస్తుత ఆంధ్ర—తెలంగాణ సంక్షోభానికి కారకులు మాత్రం మన ముఖ్యమంత్రి శ్రీ నరసింహారావు గారే' ఇక పోతే అదే సంచికలోని 'రాజధానిలో రాంగోళ్ళు' శీర్షికని సుధామగారి 'కోపం వస్తే నేను మనిషిని కాను తెలుసా? (ఇప్పుడు మహా అయినట్టు)' అందులోనే మరోచోట 'బాంచను దొరా?' అన్న వాళ్ళందరికీ పుష్పక విమానాలు, కాని వాళ్ళందరికీ ముళ్ల కాలు మలుకులు'—.

'బాంచను దొరా! అన్న వాళ్ళందరికీ'—అంటే, 'సుధామ'గారి ఉద్దేశ్యంలో 'తెలంగాణ' వాళ్లకి అనే కదా? ఈ ఒక్కమాట చాలదా ఆంధ్రావాళ్ల సుపీరియారిటీకాంప్లెక్స్ ఫ్యూడల్ మనస్తత్వం, మేం పాలకులం మీరు పాలితులు అనే భావం కనుగొనటానికి ఒకప్పుడు 'బాంచను దొరా?' అన్నవాళ్లే నాజీ నైజాంకు వ్యతిరేకంగా, ఆతర్వాత దొరల, దేశముఖ్‌ల గోపిడీకి వ్యతిరేకంగా, 52 లో 56లో 63 లో 69లో వలస పెత్తనానికి వ్యతిరేకంగా వీరోచిత

(64వ పేజీ చూడండి)



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం 9-2-73
శ్రీపరీధావి నామ సం॥ మాఘమాస ॥ బ॥ చతుర్థి
సంపుటము : 66 సంచిక : 21

స్థాపితం 1908
సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రికా కార్యాలయము
7 తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు

## విషయానుక్రమణిక

రెండూ తీసిపారెయ్యవలసినవే
















# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

### వారం మంత్రులు

కృష్ణరాయల కొలువులో గొడుగుపాలుడు అనేవాడు ఉండేవాడు. రాయలు గుర్రంమీద సవారయి దౌడు తీస్తుంటే, ఆయనకు ఎండ తగులకుండా గొడుగు పట్టడం వాడిపని. కనుకనే గొడుగుపాలుడయ్యాడు. ఒకమారు రాయలు పెనుగొండ నుంచి ఆఘమేఘాలపై విజయనగరానికి రావలసి వచ్చింది. గొడుగుపాలుడూ వెంట వచ్చాడు. రాయలకు అర్ధరాత్రి జ్ఞాపకం వచ్చింది... గుర్రంమీద వచ్చిన నాకే ఇంత అలసటగా ఉందే. గొడుగుపాలునికి ఎట్లా వుంటుందో? అని. ఏమయితేనేం? వాడి కొలువుకు ఆనందించారు రాయలు. ఏమి కావాలో కోరుకోమన్నారు. 'దేవరా, కొన్ని దానాలు, మంచిపనులు చేయాలని మనసులో ఉంది. ఒకదినం రత్నసింహాసనం దయచేయించండి' అని విన్నవించాడు గొడుగుపాలుడు. రాయలు సరే నన్నారు. గొడుగుపాలుడు ఒక సూర్యోదయంనుంచి మరొక సూర్యోదయంవరకూ రాజ్యం చేశాడు. ఎన్నోదానాలు ఇచ్చాడు. ఇది మా తాతగారు శ్రీ నరసింహాచార్యులు చెప్పినకథ. గొడుగుపాలుని బొమ్మతో, పేరుతో నేడు ఎన్నో భూములు, చెరువులు పశ్చిమాంధ్రంలో ఉన్నాయి. ఈ కథలో కొంచెమయినా నిజం లేకపోదు. ఇటీవల ఆంధ్రప్రదేశ్ సమైక్యాన్ని బందోబస్తు చేయడానికి చివరిమేకుగా బిగించిన నడమంత్రపు మంత్రివర్గాన్ని చూస్తే, గొడుగుపాలుని కథ జ్ఞాపకం వచ్చింది. అయితే, ఈ మంత్రులయినా, సమైక్యానికి గొడుగుపాలునిలాగ కొంతకు కొంతయినా సేవ చేసుంటే బాగుండేది. దురదృష్టవశాత్తు సమైక్యసంరక్షణ ప్రయత్నాలన్నీ గాడి తప్పినబండి అయ్యాయి. మళ్లీ అవి గాడిన పడడం ప్రజాభీష్టం కానప్పుడు ఎవరూ ఏమీ చేసేది లేదు.

### రాష్ట్రపతి పాలన

రాష్ట్రపతి పాలనపై జంటనగరాలలో అంతగా ఉత్సాహం కనిపించడంలేదు. రాష్ట్రపతిపాలన ముచ్చటగా మూడునెల్లే వుంటుందని, అంతలోగా ఆశ్చర్యాలు జరిగేవి ఏవీ వుండవని కొన్ని వర్గాలవారు అభిప్రాయ పడుతున్నారు. సమైక్యస్థాపనకే ఈ మార్పు అయ్యేట్లయితే మాత్రం పొరపాటు కావచ్చునేమోనని అధికసంఖ్యాకుల అభిప్రాయం. 'రాష్ట్రపతి పాలన రాష్ట్ర విభజన ప్రాతిపదికగా ఎన్నికల ఏర్పాటుకు దారితీస్తే, అసందిగ్ధంగా ప్రజాభిప్రాయం ప్రకటిత మవుతుంది గనుక, పరిపాలనలో అపార అనుభవంగల ప్రధానకార్యదర్శి శ్రీ వి. కె. రావు వంటివారు గవర్నరు సలహాదారులుగా నియమితులయ్యారు గనుక రాష్ట్ర విభజనలో చిక్కులేమీ వుండవు' అని వేర్పాటును సమర్థించే పెద్దలు నాతో అన్నారు. 'రాష్ట్రపతి పాలనలో సమైక్యం గురించి నచ్చజెప్పడానికి కొత్త విషయాలు ఏమున్నాయి? కొత్త నాయకులు ఎవరున్నారు? పాడిందే పాటరా— సామెతగా, ఆ మిర్జాలు, గోవిందనారాయణులు, పలికే పలుకులేగదా? 16 సంవత్సరాలుగా రాని సమైక్య, సౌభ్రాత్ర, సౌమనస్య భావన 16 నాళ్లలో వస్తుందా?' అన్నారు ఈ నాయకులు.

### రెండు యమపాశాలు

పాశం అంటే కొలికి. రెండువైపులా కొలికులున్న పగ్గాన్ని ఉభయతః పాశా రజ్జుః అన్నారు. పూర్వపు సంఘంలో సంఘాన్నంతా కొలికి లాగ ఆవరించే నియమాన్ని, ఆచారాన్ని కూడ పాశమన్నారు. వరుణపాశం, అలాంటిదే. వాడు చివరికొలికి విసరి శత్రువును చంపవచ్చునని గ్రహించిన తర్వాత, ఈ పాశాన్ని యముని ఆయుధాలలో చేర్చారు. ఈ యమపాశం వంటివే, సెక్రటేరియట్ భవనం దాటినవెంటనే పోలీసు కంట్రోలురూము చౌరస్తా చేరే వంకర వంతెన, హుస్సేన్‌సాగర్ చెరువు గట్టు చివర బోట్‌క్లబ్బు దాటిన తర్వాత ఉన్న వంకరవంతెన. ఇటీవలి, ఉత్సవాలు, ఊరేగింపులు ఎక్కువ కానుకాను కొంగమెడలాగ, మంచినీళ్ల కూజా మెడలాగ, హుక్కాభాండం కొమ్ములాగ వున్న ఈ వంతెనలు జనప్రవాహం సంచారానికి ఎంతగా అడ్డు తగులుతున్నాయో అందరికీ తెలిసిందే. చాదర్‌ఘాట్ బ్రిడ్జిని, నయాపుల్‌ను వెడల్పు చేసినట్టే ఈ రెండు వంతెనలను వెడల్పుచేస్తే మునిసిపాలిటీవారు జంటనగరాల కృతజ్ఞతకు మరొకమారు పాత్రమవుతారు. చిన్నవంతెనలే గనుక ఆట్టే ఖర్చూ వుండదు. ధరస్వల్పం! ఫలమధికం!

### వాహ్వా విరసం!

మూడునెల్లుగా పరిపాలన స్తంభించిపోయింది రాష్ట్రంలో. ఒకవైపు సంప్రతింపులంటూనే అరెస్టులు, కాల్పులు జరుగుతున్నాయి. ఒక్క మహారచయితయినా ఒక్క పలుకు పలుకలేదు. కాని, ఆంధ్రప్రదేశ్ విప్లవ రచయితల సంఘం రాష్ట్ర విభజనను ఘంటాపథంగా, అసందిగ్ధంగా సమర్థించినందుకు అభినందిస్తున్నాను—ఈ విషయంలో మాత్రం. ప్రపంచంలో ఏమూల ఏమి అన్యాయం జరిగినా ఎలుగెత్తాడు ఆంధ్ర రచయిత. తన ప్రజలకే అన్యాయం జరిగినప్పుడు మిన్నకుండడం ఏమి న్యాయం?

### ఉపశ్రుతి

అబిడ్‌షాపు ప్లాట్‌ఫారంమీద పాతపుస్తకాలు చూస్తున్నాను. మంచివేవైనా దొరుకుతాయేమోనని. గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'మూన్నాళ్ల ముచ్చట' కనిపించింది. కొనుక్కొని తిరగేశాను.

(10వ పేజీ చూడండి)

# బడబానలమై ప్రజ్వలించిన ఆంధ్రజాతి!

త్రిలింగ పుణ్యభూమి పొగలతో, సెగలతో భుగభుగలతో దావానలంతో బడబానలంతో మహోద్ధృత ప్రభంజనలతో గగన సీమను అందుకొంటున్న ఈ భయానకమైన మహోపద్రవకరమైన తరుణంలో ప్రధాని అత్యంత సమయస్ఫూర్తితో వ్యవహరించాలి.

ధ్రువులై మార్కండేయులై ప్రహ్లాదులై చిరంజీవులైన ఆంధ్ర విద్యార్థులు, చిత్తూరు నుండి శ్రీకాకుళం వరకు వేలాది శిబిరాలను నిర్మించుకొని కఠోరమైన ఉపవాస దీక్షలతో మహోగ్రమైన తపస్సు చేస్తున్నారు. ఈ శిబిరాలలో స్త్రీ పురుష విచక్షణ లేక ఆబాలగోపాలం పాల్గొంటున్నారు.

## వనితల వీరవిహారం

పాంచాలివలె మాంచాలవలె పద్మినులు విజృంభిస్తున్నారు. సత్యభామలవలె తెలుగు నగర శృంగాటకాలలో ఆంధ్ర వనితలు వీరవిహారం చేస్తున్నారు. రాణీ రుద్రమలై ఝాన్సీ లక్ష్మిలవలె రౌద్రావేశంతో లై ఆంధ్ర నినాదాలతో ఊరేగుతున్నారు.

బాలచంద్రులై వీరాభిమన్యులై విద్యార్థి సేనా వాహినులు నేల యీనినట్లు సభలలో సమావేశాలలో సాక్షాత్కరిస్తూ నిప్పు ముద్దలను చప్పరించడానికి, అగ్నిగోళాలను కబళించడానికి కొదమ సింగాలవలె లంఘిస్తున్నారు.

పరశురాములై ప్రకోపించిన అధ్యాపక బృందాలు ఈ మహోద్యమంలో ప్రవేశించారు. వందలాది ద్రోణులై వేలాది విశ్వామిత్రులై పరాక్రమిస్తున్నారు.

వేలాది ఆంధ్రయోధుల పచ్చి నెత్తుటితో తెలుగు గడ్డ రక్తార్ణవమైపోయినది. వందలాది మహావీరులు మరతుపాకులకు గురియై నిండుప్రాణాలనే ఆహుతి చేశారు. ఆ వీరాభిమన్యుల కన్నతల్లుల గుండెలు బద్దలైనవి. కన్నీరులు పన్నీరులైనవి. ఆ సుమంగళుల పసుపు కుంకుమలు నీటిపాలైనవి.

## స్వతంత్ర ఆంధ్రదేశం

కొన్ని నగరాలు మండిపోతున్నవి. రాజ్యాంగబద్ధమైన విధానంతో అధిక సంఖ్యాకులైన శాసన సభ్యులు ప్రత్యేక రాష్ట్ర వాంఛను పదే పదే వ్యక్తం చేశారు. ఆంధ్ర నాయకులు అయోమయావస్థలో నిపత్కరమైన పరిస్థితిలో సర్వతంత్ర స్వతంత్ర భూభాగంగా ఆంధ్రదేశాన్ని ప్రకటించే ఉద్రిక్తమైన ఉపద్రవకరమైన మహా ప్రమాదకరమైన వాతావరణంలో ఉన్నారు.

'అమ్మా!

భారత ప్రధానివైన మీకు ఈ భారత దేశంలో ఒక సామాన్య పౌరునిగా ఒక మనవి చేస్తున్నాను.

భూస్వామ్య సంస్కరణ, దారిద్ర్య నిర్మూలన కులమత భేదములకు అతీతమైన సామ్యవాద వ్యవస్థను నిర్మించే సత్సంకల్పంతో దీక్ష వహించిన మీ నాయకత్వాన్ని సమర్థించాను. మీ జీవిత చరిత్రను పద్యాలుగా వ్రాశాను. పాటలు రచించాను. ఆంధ్రదేశమంతటా ఆ గానం ప్రవహించింది. ఆ నాడు ఎటు విన్నా మీ పేరే ధ్వనించినది. కానీ ఈనాడు ఎటు కన్నా మీకు వ్యతిరేకతే కన్పిస్తున్నది.

## ఆగ్రహావేశాలు

మీపై చేస్తున్న వ్యతిరేక నినాదములతో చెవులు చిల్లులు పడుతున్నవి. ఆబాల గోపాలం ఒక్కసారిగా మీపై చూపుతున్న ఆగ్రహావేశాలకు అంతు లేకపోతున్నది.

నెహ్రూ కన్నబిడ్డవై, గాంధీజీ పెంచిన బిడ్డవై గురుదేవుడు రవీంద్రుని విద్యార్థినివైన నీలో ఈ ముగ్గురు మూర్తుల వ్యక్తిత్వాలు ప్రతిబింబిస్తున్నవని చిత్రించిన ఈ కలాన్ని విసర్జించవలసినదేనా? అగ్రరాజ్యాలను ధిక్కరించి ఆదిశక్తివై పైకిలేచి వంగదేశానికి విముక్తిని ప్రసాదించిన మీకు వంగదేశీయులకూ తీసిపోని ఆంధ్రుల స్వేచ్ఛా సాంప్రదాయాల గురించి వివరించి చెప్పగల వారే లేరా?

కట్టుకొన్న భర్తను కూడా కాదని వీధికి వచ్చి మీపై ప్రచారం చేసిన లక్షలాది ఆంధ్ర స్త్రీలు సిగ్గుపడుతున్న తరుణమిది.

స్త్రీ విలువపై, స్త్రీ మాతృత్వంపై స్త్రీ నాయకత్వంపై స్త్రీ శక్తిపై అమిత విశ్వాసమున్న ఋషి సాంప్రదాయములకు చెందిన పురుషులు తలలు వాల్చుకొంటున్న పరిస్థితి ఉంది.

(10వ పేజీ చూడండి)



ప్రధానమంత్రి ఇందిరాగాంధి చిత్రపటాన్ని హైదరాబాదులో జరిగిన ప్రత్యేక తెలంగాణా కాంగ్రెస్ సర్వప్రతినిధి సభలో వేదికపై ఉంచినందుకు అభ్యంతరాన్ని తెలియజేస్తూ సభికులు ఇందిరాగాంధీ వ్యతిరేక నినాదాలతో తమ ఆగ్రహావేశాలని వ్యక్తంచేస్తున్న దృశ్యం.

ముగ్గురు మూర్ఖులు

# పక్షులు చెప్పిన కథ

మహేష్



'వంద సంవత్సరాల్లో ప్రపంచానికి నీటి కరువు రాబోతున్నదట' అన్నాడు చంప లావు.

'ఎవరు చెప్పారా విషయం?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'నీటి వనరులను గురించి ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేసిన సెమినారులో 22-1-73 న కేంద్రమంత్రి కె. యల్. రావు మాట్లాడుతూ 'వంద సంవత్సరాల్లో ప్రపంచానికి నీటికరువు రాబోతున్నది. ఉపయోగించడానికి వీలయ్యే నీరంతా అప్పటికి ఖర్చయిపోతుంది. ప్రపంచంలో దొరికే నీరు ఎప్పుడూ సమానంగానే ఉంటుంది కాని జనాభా మాత్రం రోజురోజుకు పెరిగిపోతున్నది. అందుచేత కొన్ని ప్రాంతాల్లో ఉంటున్న మిగులు నీరు వాడకం విషయంలో అన్నిదేశాలమధ్య సహకారం అవసరం' అని చెప్పాడు' అన్నాడు చంపక్ లావు.

'కేంద్రమంత్రి కె. యల్. రావు మాటలు వినగానే ఉట్టి కెగరలేనమ్మా స్వర్గానికి యెగురుతుందా? అనే సామెత నాకు గుర్తు వచ్చింది' అన్నాడు మాడా మణి.

'ఏమిటా సామెత?' అని చంపక్ లావు ప్రశ్నించగా మాడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒకప్పుడు విక్రమార్కుడు పరకాయ విద్యవలన చిలక శరీరంలో ప్రవేశించి ఒక పట్టణం చేరుకొన్నాడు. ఆ పట్టణంలో ఒక వేశ్య ఉంది. ఆ దేశపురాజు ప్రాపకం వలన ఆమె గర్వించి, ప్రజలను బాధిస్తుండేది. అందుచేత ఆమెకు ఒక గుణపాఠం నేర్పాలనుకొన్నాడు చిలకరూపంలో ఉన్న విక్రమార్కుడు.

రోజూ ఆ వేశ్య దేవాలయానికి వెళ్ళి, 'తనను బొందితో స్వర్గానికి తీసుకొని వెళ్ళ'మని దేవుణ్ణి ప్రార్థిస్తుండేది.

వేశ్య దేవాలయానికి వచ్చే సమయానికి ఒకనాడు చిలక దేవుని విగ్రహం వెనక దాక్కుంది. మామూలుగా ఆమె 'తనను బొందితో స్వర్గానికి తీసుకొని వెళ్ళ'మని ప్రార్థించగానే చిలక గంభీరమైన కంఠంతో 'నీ భక్తికి మెచ్చాను. నిన్ను బొందితోనే స్వర్గానికి పంపిస్తాను. దానికి ముందుగా నీ యావదాస్తిని పేదలకు పంచిపెట్టాలి' అని చెప్పింది.

దేవుడే ఆ మాటలను చెప్పాడనుకొని ఆ వేశ్య యెంతో సంతోషంగా తన ఆస్తి నంతటినీ పేదలకు పంచిపెట్టి దేవాలయానికి తిరిగి వచ్చింది.

'దేవాలయంలో ఉన్న ధ్వజస్తంభానికి ఒక ఉట్టి కట్టించ'మని చిలక మళ్ళా చెప్పింది.

ఆమె ఆ మాటల ప్రకారం ధ్వజస్తంభానికి ఒక ఉట్టి కట్టించింది. తరువాత ఆమె తనను తీసుకొని వెళ్ళడానికి స్వర్గం

నుంచి రాబోయే విమానంకోసం చాలాసేపు యెదురు చూసింది కాని విమానం వస్తున్న జాడ యేదీ కన్పించలేదు

అప్పుడు ఆమె దేవాలయంలోనికి వెళ్ళి 'స్వామీ! స్వర్గంనుంచి విమానం యింకా రాలేదు. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?' అని అడిగింది

'నువ్వు యెగిరి ఆ ఉట్టిలో కూర్చో' అని చిలక విగ్రహం వెనుకనుంచి సమాధానం యిచ్చింది.

'స్వామీ! ఆ ఉట్టి చాలా యెత్తుగా ఉంది నేను అంత యెత్తుకు యెగరలేను' అని ఆమె అంది

'ఉట్టికి యెగరలేనమ్మ స్వర్గానికి యెగురుతుందా?' అంటూ ఆ చిలక బయటకు వచ్చింది.

ఆ మాటకు ఆమె సిగ్గుపడింది. ఆ విచిత్రాన్ని చూడ్డానికి వచ్చిన ప్రజలందరూ, ఆమెను హేళన చేశారు.' అంటూ చూడామణి 'ఉట్టి కెగరలేనమ్మ' సామెతను వివరించాడు

'అయితే, కేంద్రమంత్రి కె యల్ రావు మాటలు వినగానే నీకు ఆ సామెత యెందుకు గుర్తుకు వచ్చింది?' అని తిరిగి ప్రశ్నించాడు చంద్రరావు

'ఉట్టి కెగరలేనమ్మ స్వర్గానికి యెగురుతుందా?' అనే సామెత కె యల్ రావు విషయంలో పూర్తిగా వర్తిస్తుంది అంటూ చూడామణి యింకా యిలాగ అన్నాడు

'తన రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లోను యింకా ముఖ్యంగా తన స్వంత నియోజక వర్గమైన విజయవాడలోను గత మూడు నెలలనుంచి యెంతో ఆందోళన జరుగుతున్నది చిన్నా, పెద్దా అనే భేదం లేకుండా అన్నివర్గాల ప్రజలు ప్రత్యేక రాష్ట్రం కోసం జరుగుతున్న ఉద్యమంలో పాల్గొంటున్నారు. ఈ ఉద్యమం వలన సామాన్య ప్రజలు యెన్నోబాధలకు గురి అవుతున్నారు కొంత మంది యువకులు తమ ప్రాణాల్ని కూడా త్యాగం చేస్తున్నారు

తన స్వంత నియోజకవర్గంలో ప్రస్తుతం యింతటి విషమ పరిస్థితి యేర్పడినా కూడా, నోరు మెదపని కె యల్ రావు వంద సంవత్సరాల్లో రాబోయే 'టికరువును గురించి హెచ్చరించడం హాస్యాస్పదం కాదా? 'ఉట్టి కెగరలేనమ్మ స్వర్గానికి యెగురుతుందా' అనే సామెత అతనికి యిప్పుడు వర్తించదా?' అని తిరిగి ప్రశ్నించాడు చూడామణి

'ఆంధ్ర ప్రజలు, తెలంగాణా ప్రజలు కలిసి ఆంధ్రప్రదేశ్‌లో పదహారు సంవత్సరాలపాటు ఉన్నారు. అయినా, ఒకరిమీద ఒకరికి నమ్మకం కలగలేదు ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ విభజన తప్పనిసరి అయ్యే పరిస్థితి యేర్పడింది. దీనికంతటికీ కారణం యెవరు?' అని అడిగాడు చిదంబరం.

'ఈ పరిస్థితి యేర్పడ్డానికి, ఆంధ్రప్రదేశ్‌ను యింతవరకు పరిపాలించినవారే కారణం. కాంగ్రెసుపార్టీ తరఫున మంత్రులుగా యిదివరకు ఆంధ్రప్రదేశ్‌ను పాలించిన, సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి, చెన్నారెడ్డి, వి బి రాజు వగైరా నాయకులు. ఆంధ్ర తెలంగాణా ప్రజలమధ్య భావ సమైక్యతను కలిగించలేకపోయారు. వారు తమ ముఠా రాజకీయాల్లో చూపించిన శ్రద్ధలో పదవవంతు శ్రద్ధకూడా ప్రజల మధ్య సుహృద్భావాన్ని కలిగించడానికి చూపలేదు. పైగా వారి ముఠారాజకీయాల వల్ల ఆంధ్ర తెలంగాణా ప్రజలమధ్య భేదాభిప్రాయాలు మరింత పెరిగాయి

సుమారు సంవత్సరం క్రిందట ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా పి. వి నరసింహారావును నియమించింది. నరసింహారావుకుగల పరిపాలనా సామర్థ్యన్ని, ప్రజాభిమానాన్నిబట్టి కాకుండా, అతనికి తన (ఇందిరాగాంధీ) యెడల ఉన్న వినయ విధేయతలనుబట్టి ఇందిరాగాంధీ అతన్ని ముఖ్యమంత్రిగా నియమించింది ముల్కీ రూల్సుగురించి సుప్రీం కోర్టు తీర్పు యిచ్చిన తరువాత రెండు ప్రాంతాల ప్రజల్లో కలిగిన భయాన్ని, అనుమానాన్ని ముఖ్యమంత్రి నరసింహారావు నివారించలేక పోయాడు అందుచేత యింతటి ఆందోళన జరుగుతున్నది 'ఆంధ్రప్రదేశ్ విభజనకాక తప్పదు' అనే పరిస్థితి యిప్పుడు యేర్పడింది. ఇంతేకాదు ప్రధానమంత్రి ఇందిరాగాంధి తనకు విధేయుడై ఉండే నరసింహారావును ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రిగా నియమించడం తుదకు ఇందిరాగాంధీ ప్రాబల్యం బలహీనం కావడానికి కారణం అయినప్పటికీ మనం ఆశ్చర్యపోనక్కరలేదు' అన్నాడు చూడామణి.

'సామర్థ్యాన్నిబట్టి ప్రజాభిమానాన్ని బట్టికాకుండా, వినయ విధేయతలనుబట్టి ఇందిరాగాంధీ నరసింహారావును ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా నియమించడంవలన ఆంధ్రప్రదేశ్‌లో యిటువంటి పరిస్థితి యేర్పడిందంటే కొంతవరకు అంగీకరించవచ్చును. కాని యిది ఇందిరాగాంధీ ప్రాబల్యం బలహీనం కావడానికి కారణం కావచ్చునని నువ్వు యెలాగ చెప్పగలవు?' అని ప్రశ్నించాడు చంద్రరావు

'కార్యకారణ సంబంధం ఒక్కోసారి చాలా సూక్ష్మంగా ఉంటుంది. దీన్ని గురించి రెండు పక్షులు ఒక కథ చెప్పాయి కదా!' అన్నాడు చూడామణి

'ఏమిటా కథ?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు

'ఒకప్పుడు ఒక చెట్టుమీద రెండు పక్షులు మాట్లాడుకొంటున్నాయి. వాటిలో ఒక పక్షి యిలాగ అంది 'ఇప్పుడు ఒక వ్యక్తి గుర్రంమీద స్వారీచేస్తూ యిలాగ వస్తాడు అతను కుడివైపున ఉండే దారి గుండా వెళ్ళడానికి ప్రయత్నిస్తాడు, కాని గుర్రం బెదిరి యెడమవైపు ఉన్న దారిని పరుగెడుతుంది. దానివలన యీ రాజ్యంలో యిరవై సంవత్సరాల తరువాత చాలా అల్లకల్లోలం జరుగుతుంది.'

'ఇప్పుడు గుర్రం బెదిరి యెడమవైపున ఉన్నదారిని పరుగెత్తడం, యిరవై సంవత్సరాల తరువాత ఈ రాజ్యంలో అల్లకల్లోలం జరగడానికి కారణం యెలాగ అవుతుంది?' అని రెండో పక్షి మొదటి పక్షిని అడిగింది.

ఎడమవైపున ఉన్న దారిలో ఒక చెట్టుమీద తేనెపట్టు ఉంది. ఈ గుర్రం ఆ చెట్టుకొమ్మలను రాసుకొంటూ పరుగెత్తడంవలన తేనెటీగలు నాలుగువైపులకు యెగురుతాయి వాటిలో ఒక తేనెటీగ పక్కనే ఉన్న అంతఃపురంలో ప్రవేశిస్తుంది. గర్భిణి అయిన రాణి ఆ సమయంలో మేడమెట్లు దిగుతూ ఉంటుంది. ఈ తేనెటీగ ఆమెను కుడుతుంది. ఆమె ఆ బాధ భరించలేక మేడమెట్లుమీదనుంచి పడిపోతుంది. అందువలన ఆమె గర్భం పోతుంది. తరువాత ఆమెకు సంతానం ఉండదు. ఇరవై సంవత్సరాలు అయిన తరువాత యిప్పుడు పరిపాలిస్తున్న రాజు చనిపోతాడు. అతనికి వారసులు ఉండరు.

## ముగ్గురుమూర్ఖులు

అందుచేత రాజ్యాధికారంకోసం రాజ్యంలో అల్లకల్లోలం జరుగుతుంది' అని మొదటి పక్షి రెండవ పక్షికి చెప్పింది.

పక్షుల భాషను తెల్సిన ఒక వ్యక్తి ఆ సంభాషణను విన్నాడు. అతను ఒక్కడే కొంచెంసేపు ఉండగా ఒక వ్యక్తి గుర్రం మీద స్వారీచేస్తూ వచ్చాడు. అప్పుడు నిజంగా గుర్రం బెదిరి, యెడమవైపుకే వెళ్లింది. తరువాత కూడా పక్షులు చెప్పినవన్నీ అలాగే జరిగాయి.

అలాగే ఒక్కోసారి చిన్న విషయంకూడా పెద్ద విషయానికి కారణం కావచ్చును' అంటూ మూడామణి యింకా యిలాగ అన్నాడు.

ఆంధ్రప్రదేశ్ విభజన జరగ్గానే, మిగిలిన రాష్ట్రాల్లోకూడా యిటువంటి ఆందోళనలు జరుగుతాయి. ఉత్తర ప్రదేశ్‌లో తూర్పు ప్రాంతంలోకూడా యిటువంటి ఆందోళన అప్పుడప్పుడు కొంచెం జరుగుతున్నది. అది యిప్పుడు పెద్దది కావచ్చును. 1974 వ సంవత్సరం ప్రారంభంలో ఉత్తరప్రదేశ్‌లో యెన్నికలు జరుగనున్నాయి. అక్కడ రాష్ట్ర విభజన గురించి ఆందోళన కారణంగా కాంగ్రెసుపార్టీ బాగా దెబ్బ తినవచ్చును. క్రమంగా అది ఇందిరాగాంధీ ప్రాబల్యం సన్నగిల్లడానికి దారితీయవచ్చును.'

'ఇప్పటికే - చాలా ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

## హైదరాబాద్ ...

(6వ పేజీ తరువాయి)

'పసమేమే యన ముద్దరాలొకతె
ఉద్వాహంబు నాకంచు
సంతస పాటెల్లను వెల్లడించె, నట
మూన్నాళ్లేగ, నామీద నా
మునుగేమే యన, నాదునాథు
డయయో పోమెంగదా యంచు
వెక్కసపుం దుఃఖము వెల్లడించె
నట; ఈ గాథార్థ మెట్లేగదా!'

అనే చివరి పద్యంపై దృష్టి పడింది. ●

## ...ఆంధ్రజాతి

(7వ పేజీ తరువాయి)

రాజకీయాలలో నేటి స్థితి రేపు అదృశ్యం కావడం అతి సహజం. ఎంతో చల్లగా మెల్లగా అమృతం కురిసినట్లు 'ఆంధ్రప్రదేశ్'ను విభజిస్తున్నాను. ప్రత్యేక రాష్ట్రమును ప్రకటిస్తున్నాను అంటూ ఈ క్షణమో మరుక్షణమో నేడో రేపో మీరు అనగలరనే ఆశతో అనుక్షణం నిరీక్షిస్తున్నాను.'

వేదనలతో ఆవేదనలతో ఆవేశాలతో ఆగ్రహాలతో ఆంధ్రజాతి యావత్తూ వెళ్లబుకుతున్న ఈ స్థితిని ఎంతో భయంకరమైన ఈ పరిస్థితిని ఆంధ్ర జిల్లాలలోని కలెక్టర్లు, కేంద్ర సి. ఐ. డి. శాఖవారు ప్రధానికి ఎరుకపరచడంలో ఎందుకు వెనుకంజ వేస్తున్నారు.

### ప్రవహించే లావాలో ఈత!

కేంద్ర రిజర్వు పోలీసులతో సైనికులతో ఆంధ్రభూభాగాన్ని అదుపులో పెట్టగలమనే అడియాసలింకా ఉన్నవా? ఉన్నతాధికార మండలిలోని నాయకులకింకా అట్టి ఆలోచనలున్నవా? ప్రవహించే లావాలో వారు ఈదులాడబోతున్నారా? ఆత్మ గౌరవానికి భంగం కలిగినపుడు అగ్నిప్రవేశాలు చేసిన ప్రాయోపవేశాలు చేసిన ఆంధ్రజాతి చరిత్రను వారు ఎరుగరా? శివతాండవం చూడ దలిచారా? దక్షయజ్ఞాలు చేయదలిచారా? వీరభద్రులను సాక్షాత్కరించుకోవాలా? కనకదుర్గలను ఆహ్వానించాలా? లేపాక్షి బసవలను లేవగొట్టాలా? ఆంధ్రదేశమే మండిపోతుంటే హైదరాబాదుతో యాదవతో మంతనాలా? హస్తినలో వాలి ఆ ఇందిరమ్మతో తాడో పేడో తేల్చుకోక! అంగీకరిస్తే ఆంధ్రరాష్ట్రం లేదా ఆంధ్రదేశం! అంతే!

—కె. సభా ●

**ఎస్. వి. ఆర్, బేతోలు**

**ఇప్పటి పత్రివతలపై మీ అభిప్రాయం ఏమిటి?**

ఎప్పుడూ వర్తమానానికి విలువ ఎక్కువ అని నమ్ముతాను నేను. ఆధునిక పతివ్రతలు మీ పురాణ స్త్రీల కేవమాత్రం తీసిపోరు. ఆర్థికంగా కుటుంబ బాధ్యతలు పంచుకుంటున్నారు. చాలీ చాలని జీతాలకీ, ఆకాశన్నంటుతున్న ఖరీదులకీ ఎలాగో వంతెన కట్టి—వండి పెడుతున్నారు. యిది యినుప గుగ్గిళ్లను వండడం కంటే ఏంతేనని నా నమ్మకం.!

**ఒక సోదరి, కాకినాడ**

**భర్త యిష్టపడని వ్యక్తులకు అతిథి మర్యాదలు జరిపే హక్కు గృహిణిగా స్త్రీకి లేదా?**

ఎందుకు లేదు? ఎటొచ్చీ ఆ అతిథి మర్యాద భర్తను కించపరచేదిగా కాకుండా వుంటే చాలు.

**పి. పి. ఆర్, కొండముద్రుపాలెం**

**నేను సన్యాసం పుచ్చుకోవాలనుకుంటున్నాను. నా తల్లితండ్రులు పెళ్లి చేయాలంటున్నారు.**

పెళ్లికాని వాడికి సన్యాసం ఎందుకు? అనవసరం!

**కుమారస్వామి. వాడేగాంవ,**

**(మహారాష్ట్ర)**

**మీరు ఆడవాళ్లని చాలా పొగుడుతారు కదా. వారిని గురించి అంత తెలిసా? లేక అంతా తెలిశా?**

పోనీ 'ఏం తెలియక' అని మీరనుకుంటున్నారు. చాలదా కుమారా!

**ఎమ్. వి. ఆర్, విజయవాడ**

**ఏమిటీ ప్రశ్నావళి? దీర్ఘరోగంలా?**

అవును బ్రదర్—యిది జీవితంలా! దీర్ఘ రోగం.

**ప్రేమాంబుజం, తంగుడుబిల్లి**

**విద్యావంతురాలైన ఆధునిక యువతికి ఏటువంటి సంస్కారం వుండాలని మీరు వూహిస్తున్నారు?**

ఎదుటి వారి సంస్కారాన్ని శంకించకుండా వుండకల సంస్కారం వుంటే చాలు.

**జయశ్రీ, సికింద్రాబాదు**

**తమకన్న ఉన్నతదశలో నున్న వ్యక్తిని చూసినవారెవరేనా యిలాగే కించపరుస్తారు. కనుక మీరు అసహనం చెందనక్కరలేదు.**

నాకు అసహనం లేదు— నాది 'ఉన్నత దశ'అని నేను భావించడం లేదు. నన్ను ప్రశ్నించే వారు నన్ను కించ పరుస్తున్నారని అనుకోవడం లేదు. అలా అనుకునే మాటుంటే నన్ను తిట్టేవి, దీవించేవి కూడా ప్రచురించే ధైర్యం నాకెక్కడ మిగులుతుంది? నా కిష్టమైనట్టు చెప్పే హక్కు నాకెలా వుందో—వారిష్టం వచ్చినవి అడిగే హక్కు వారికీ వుంది. ఏమంటారు?




**పి. ఎమ్. ఆర్, హైద్రాబాదు**

**పెళ్లయిన మగవాడు అందంగా వున్న ఆడివారివంక తలతిప్పి చూడ్డమే తప్పా?**

కాదు. హృదయం చెప్పిన మాట విన్నంత కాలం—తల ఎటు చూసినా ఫరవా లేదు!

**కె. వి, హైద్రాబాదు**

**మీ రెందుకు అంత చిన్న సమాధానాలు రాస్తారు? మాకు చాలా అసంతృప్తిగా వుంటుంది.**

చూడండి వెంకటేశ్వర్లుగారూ, మాటలుకూడా చెట్టు ఆకులాంటివే. గుబురుగా వున్నచోట ఫలాలు వుండడం అరుదు!

**ఆర్. ఆర్, జోగిపేట**

**రామలక్ష్మిగారూ, అందమైన ఆడది సాధించలేనిది ఏమిటో కొంచెం తెలియచేస్తారా?**

సాటి ఆడదాని సానుభూతి.

**ఎస్. జి. జెడ్చెర్ల**

**అక్కయ్యగారూ, మీరు నా స్థానంలో— నేను మీ స్థానంలో వుండి వుంటే?**

మీరు రెండు నిముషాల్లో పారిపోయి— పరుగు పందెంలో ప్రపంచ రికార్డు విరిచిన ఘనత దక్కించుకునే వారు! ప్చ్! దురదృష్టం.

**సి, హెచ్. వి. కె, ముప్పవరం**

**కన్నం వేసే దొంగకు, లంచం అడిగే వ్యక్తికి తేడా ఏమిటి?**

దొంగ దొరికి పోతే జైలుకి వెడతాడు. లంచం వాడు మళ్లీ లంచం యిచ్చి తప్పించుకోకల్గుతాడు! అదీ తేడా.

**వై. కె, చిత్తూరు**

**వదినా, ఒక చిన్న సందేహం. యింత మంది యిన్నిరకాలుగా మిమ్మల్ని ప్రశ్నలు వేస్తున్నారు కదా? వాటన్నిటికీ జవాబులు మీరే రాస్తారా? మీ అక్కయ్యగారి సలహా తీసుకుంటారా?**

నీ ఆడబడుచు బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు అయినా అంబలి తాగేవాడికి మీసాలు ఎత్తేవాడొకడు కావాలా? మనిషా? మరి చోద్యం!

**డి. ఎస్. ఆర్, నరసారావుపేట**

**ఉరిశిక్ష తీసివేసి దానిస్థానే ఆ వ్యక్తి మీ నవలలు చదవాలని నిర్బంధిస్తే సరి పోదా?**

మరన్ని నవలలు రాయుతేనే ఎలా? ... కొంచెం సాయం చేస్తారేమిటి?

**జి. వి, హైదరాబాదు**

**బయాగ్రఫీ జాగ్రఫీ...ప్రాసమీది మోజ ప్రశ్నలో ఆ మాట జరుగదగాదని నమ్మకం— నిజానిజాలు తెలుపకలరా?**

ఏం? ఆ మాత్రం ప్రాస నాకు చేతకాదనేనా మీ భయం— బాప్స్, మేప్స్— ఏం ఖర్మ— ఏ మాటకైనా రైమ్ చెప్పొచ్చు—కొంచెం 'డిక్షనరీ ఆఫ్ రైమ్స్' అడపా తడపా తిరగ వేస్తుంటే!!

నాకు నిఘంటు పఠనమొక తీరని దాహం. సరదాకి మీరు కొవ్వలినవల చదువుతారు. నేను ఛాంబర్స్ తో పాటు పేజీలు చదువుతాను. అందుకే విజ్ఞానం కోసం ఎక్కడ వెతకాలో తెలిస్తే చాలనడం

**వి. ఎస్. ఆర్, కావలి**

**తీయనిబాధ అంటారే— బాధలో తీయదనం ఏముంటుందండీ?**

చిట్టితల్లి— విరహం— తీయని బాధ. ప్రసవం తీయని బాధ. ఏ బాధ తరువాత హాయి లభిస్తుందో — అదీ తీయని బాధ.

**శేషశివ, బొబ్బిలి**

**ఆంధ్రాలో జరిగే ముల్కీ గొడవలపై మీ అభిప్రాయం? సమగ్ర ఆంధ్రరాష్ట్రానికా? ఆంధ్రా తెలంగాణా విభజనకా మీ ఓటు?**

నేను సమైక్యవాదిని. ఆంధ్రాలోనే కాదు ఎక్కడ జరుగుతున్నా యిలా గొడవల వెనుక ఆయా రాజకీయవేత్తల స్వార్థాలు కొట్టొచ్చినట్టు కనపడ్డం లేదా? ఈ గొడవలు రాజేసి తమ పబ్బం గడుపుకోవాలని తహతహలాడే నాయకులను నమ్మి జనం చేయకల్గేది ఏముంది?— కోరి అవస్థలు పడడం తప్పించి. ఇప్పటికేనా మించి పోలేదు ఈసారేనా ఆంధ్రలో ఎన్నదగ్గ పురోభివృద్ధికి నాంది పల్కితే చాలు— యీ ప్రత్యేకాంధ్రవాదులు రాష్ట్రం అంటే ఒక్క రాజధానే కాదని— యీ పురోభివృద్ధి పథకాలు— రాష్ట్ర వ్యాప్తంగా వుంటే— అంతే చాలు. ●




గోపాలానికి— కథ వ్రాయాలని ఉంది.

అతని మనస్సు కథ వ్రాయాలని అమితంగా ఉత్సాహ పడుతోంది. ఉద్రేకం ఉరకలు వేస్తోందతనిలో.

కాని— ఎలా?

కథ వ్రాయడం ఘనకార్యం కాదని గోపాలానికి తెలుసు. కథ వ్రాస్తే అచ్చు కాదేమో అన్న అనుమానం అణుమాత్రమయినా అతనిలో లేదు. రెండేళ్ళ క్రిందటి వరకూ గోపాలం విరివిగా కథలు వ్రాశాడు. వివిధ పత్రికలలోనూ అవి ప్రచురింపబడుతూ ఉండేవి. ఆ రోజుల్లో— విధిగా వారానికో కథ వచ్చేది గోపాలానిది.

అతని కథలకోసం పత్రికలే ఎదురు చూసేవి.

పాఠకులు — గోపాలానికి ప్రేమకథల స్పెషలిస్టనే బిరుదుకూడా ప్రసాదించారు ఉత్తరాల శీర్షికలో. అమ్మాయిలు కూడా— ప్రేమకథ వ్రాస్తే గోపాలమే వ్రాయాలని సర్టిఫికేటు యిచ్చేశారా రోజుల్లో.

కథకుడిగా అప్రతిష్ఠుడైన గోపాలం ఏడాదినుంచి అచ్చులో కనపడటం మానేశాడు. హటాత్తుగా పత్రికలలోంచి అంతర్ధానమైపోయాడు. పత్రికలూ, పాఠకులూ పెట్టుకున్న అన్ని కేకల్నీ, అభ్యర్థన లేఖలూ—అన్నిటినీ కాదనేశాడు. ఇదంతా నిజమే. అవగింజంత అయినా అబద్ధం లేదిందులో.

గోపాలం కథలు రాయడం మానెయ్యడానికి వెనుక చాలా విచిత్రమైన కథ

ఉంది. నాటకంలో అంతర్నాటకానికున్నంత ప్రాముఖ్యం ఉంది దానికి. అదో అందమైన కథ.

ఈ క్షణంలో అంతరసవత్తరమయిన కథ చెప్పడానికి అనువైన పరిస్థితిలో లేడు గోపాలం.

అతను గతం తలుచుకుంటూ పశ్చాత్తాపపడుతున్నాడు.

పశ్చాత్తాపపడుతూ కారు డ్రైవ్ చేస్తున్నాడు.

అసలే అది చాలా బిజీరోడ్డు. అటువంటి రోడ్డు మీద — ఆలోచిస్తూ నడవడమే అపరాధం. ఆలోచిస్తూ కారు డ్రైవ్‌చేస్తే ఎన్ని యాక్సిడెంట్లవుతాయో? కథకుడైన గోపాలాన్ని తనకథ చెప్పమని బలవంతంచేసి అతని దృష్టిని మనవేపు లక్కుని అతన్ని యాక్సిడెంటు పాలుచేయడం నా కెంతమాత్రమూ యిష్టం లేదు. నేను చాలా సున్నితమైన మనిషిని. కథలో పాత్రలనయినా జీవితం అనుభవించవలసిన దశలో చంపెయ్యడం నా కెంతమాత్రమూ యిష్టం ఉండదు. పాత్రలను చంపేస్తే యిక కథేమిటి? పాత్రలనూ, పాఠకులనూ చంపేద్దామన్న దురుద్దేశం నాకేకోశానా లేదు కనుక—యిప్పుడు గోపాలం చేత మాట్లాడించను.

అదీకాక — అది గోపాలం స్వంతకథ.

కథ రాయడం వేరు. కథ చెప్పడం వేరు.

విలియమ్ హాజలిట్ అన్నట్లు ఏమనిషికయినా అతి కష్టమయిన—క్లిష్టమయిన వ్యవహారం ఏమిటంటే తనగురించి తాను చెప్పుకోడం. గోపాలం స్వంతకథలో రసం ఉంది. రసికత ఉంది. అటువంటి కథను చెప్పమని మాటిగా అడిగెయ్యడం మనకే పరసంగా ఉండదు. కథలు రాయడం మానేసినంతమాత్రాన కథకుడి వేషాలింకా గోపాలంలో పోలేదు. ఈ కథ పూర్తయ్యేలోపల ఎప్పుడో ఒకప్పుడు గోపాలం ఫ్లాష్‌బ్యాక్‌లోకీ, మెలోడ్రామాలోకీ, సోలోలోకీ వెళ్లకుండా ఉండడు. అప్పుడు మనం అతని కథను గ్రహిద్దాం. అసలు—కథ ఉత్సాహకరంగా ఉండాలంటే—కథ చెప్పబడకూడదు. సూచించబడాలంతే.

మరొక్క విషయం...గోపాలం ఆకథ చెప్పేందుకు శ్యామల పర్మిషన్ తీసుకోవాలి. ఆ రసభరితమయిన కథలో శ్యామలదే ముఖ్యమయిన పాత్ర. అందుచేత గోపాలం మరొకళ్లకి ఆ కథ చెప్పాలంటే శ్యామల పర్మిషను తీసుకోవాలి. శ్యామల అనుమతిస్తుందన్న ఆశ అతితక్కువ. అందుచేత ఆ కథ అలా ఉంచండి.

రేపటికి — కథరాసి ఏడాది!

నిట్టూర్చాడు గోపాలం.

రేపటికి — పెళ్లయి రెండేళ్లు!!

హటాత్తుగా జ్ఞాపకం వచ్చిందతనికి.

ఏం చెయ్యాలా అని ఆలోచనలో పడ్డాడు.

కారు — ఆటోమేటిక్‌గా స్లో అయింది.

సంవత్సరంపాటు ఒక్కకథకూడా వ్రాయలేదు!

నిరుత్సాహకరమయిన నిజం అది.

రేపు—రెండవ యానివర్సరీ. శ్యామల తనదై రేపటికి సరిగ్గా రెండేళ్లు!! గోపాలం పెదవులమీద మధురమైన మందహాసం నర్తించింది.

అంతలోనే—చిన్న ప్రశ్న.

వివాహంతో — శ్యామల తనదైందా? తను శ్యామల పరమయ్యాడా? తడబడ్డాడు గోపాలం.

ఆ ప్రశ్నకు సమాధానం — నిజమైన సమాధానం అతనికెందుకో అంత ఉత్సాహం గొల్పలేదు. తృప్తి నివ్వలేదు.

కథకుడు కనుక గోపాలం తనను తాను గెల్చుకుందుకు (ఆత్మవంచన!) ఆలోచనా కోణం మార్చాడు.

ఆదర్శ వివాహం — ప్రేమవివాహానికి మరోపేరు.

వివాహంలో — ఎవరు ఎవరివారయ్యారన్న ఆలోచనా దృక్పథం అతి సంకుచితమైనది. హేయమైన దృక్పథం అది. దంపతులిద్దరూ ఒకటే. అదే సవ్యమైన ఆలోచన. వివాహం— ఒకరిని మరొకరి సొంతంగా ముద్రవేసేటందు కెంతమాత్రమూ కాదు. ఇద్దరినీ ఒకరిగా ముద్రవేసేందుకు మాత్రమే.

శ్యామలా తనూ ప్రేమించుకుని— ఆదర్శంగా వివాహం చేసుకున్నారు కనుక...

అంతలోనే హంసపాదు వచ్చింది గోపాలం తృప్తికరమైన ఆలోచనలకి. తప్పనిసరిగా అతను ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లవలసి వచ్చింది. (పాఠకమహాశయా! జాగ్రత్తగా ఫాలో అవు. ఇక్కడ నీకొక ప్రేమకథ దొరికి తీరుతుంది.)

గోపాలం ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్లేముందు—కారాపి— తను కారులోనే కూర్చుని సిగరెట్ అంటించాడు. పార్కుచేసిన కారుకి ప్రమాదాలు జరగవు. ఎప్పుడేనా జరిగినా మరీ అట్టే పెద్ద గాయాలు గట్రా తగిలి ప్రాణాలుపోవు—కేవలం కథలకోసమో, సినిమాలకోసమో అయితే తప్ప.

*

గోపాలం ఉధృతంగా కథలు వ్రాస్తున్న బంగారు రోజులవి. బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్‌గా అతను ఉద్యోగంకోసం ప్రయత్నించి ప్రయత్నించి అలిసిపోయాడు. ఇక జీవితంలో తనకి ఉద్యోగప్రాప్తి లేదని గట్టిగా తీర్మానం చేసుకున్నాక నిజంగా అతని మనసు తేలికపడింది.

ఆశ — మనిషిని జీవింపజేస్తుందనేది కొంతవరకూ నిజమేకావచ్చు. కాని గోపాలం విషయంలో ఆశకంటే నిరాశే ఎక్కువ సుఖమిచ్చింది.

డిగ్రీ పట్టుకుని—ఉద్యోగంకోసం ఆఫీసులచుట్టూ అప్లికేషన్లు పట్టుకు తిరిగిన రెండేళ్లు గోపాలం క్షణం సుఖపడలేకపోయాడు. ఒక్కరాత్రీ సరిగ్గా నిద్రపోలేకపోయాడు. పడుకుంటే చాలు—పీడకలలు. పాడు కలలు.

ఉద్యోగానికి రమ్మని పిలిచినట్లు— తీరా వెళ్లేసరికి—వాళ్లు సర్టిఫికేట్లడగడం— తన జేబులోని సర్టిఫికేట్లు గల్లంతయిపోయి— తెల్లమొహంవెయ్యడం, వాళ్లు ప్యూన్‌చేత గెంటించెయ్యడం.

మరొక కల...గోపాలం అన్నం తింటున్నాడు. అర్జంటుగా ఇంటర్వ్యూకి రమ్మని వర్తమానం. తను చెయ్యి కడుక్కుని పరుగెత్తేంతలో—ఆలస్యానికి ఆగ్రహించి అధికారి తనను లెంపకాయ కొట్టేశాడు, ఇన్సల్ట్‌చేసి అవతలకి గెంటేసాడు.

విచిత్రమయినకల ఏమిటంటే—ఎల్. డి. పోస్టుకు అప్లికేషను పెట్టాడు గోపాలం. ఇంటర్వ్యూకి పిలిచారు.

టిప్‌టాప్‌గా తయారై వెళ్లాడు.

ఛాంబరులో గోపాలం అడుగుపెట్టేసరికి అంతలావు ఆఫీసరూ తన కుర్చీ అతనికిచ్చేశాడు. అతను నేలమీద—గోపాలం పాదాల దగ్గర కూర్చుని ఇంటర్వ్యూ ప్రారంభించబోయాడు.

ఫోటో ఆఫీసరు ప్లేటులో గులాబీ

ప్రాయొచ్చు. నామాట విను ఈ రోజుల్లో ప్రతివాడు కథ వ్రాస్తూనే ఉన్నాడు.'

'నాకేం వచ్చునని?'

'నీకు రానిదేమిటని? అక్షరాలు రాయ గలవు. చాలు. నీ కలలని డైరీలో రాయడం మానేసి తెల్ల కాగితాలమీద రాసి పత్రికలకు పంపు...'

'పత్రికలకా! కలలా!!' ఆశ్చర్యపోయాడు.

'పత్రికలోపడితే కల అయినా కథ కాగలదు.'

'నా కలలు కథలు కాగలవా?'

'ట్రై యువర్ లక్ మై డియర్, క[illegible]లకు అట్టే పెట్టుబడి పెట్టనవసరంలే[illegible] కొంచెం తెల్ల కాగితాలూ — కలమూ.. నీకెలాగా టైము ఫ్రీయే.'

'కాదు—'

'కథ రాస్తావు కదూ?'

'కల రాస్తాను'

'పత్రిక్కి పంపుతావ్ కదూ?'

'ఊఁ'

అంతరాత్మకి చేసిన వాగ్దానాన్ని నెరవేర్చ కుండు కయిదురోజులు పట్టింది. కలని పేర్చితే—కథలా తయారయింది.

పత్రికకి పోస్టుచేసేశాడు ఆలస్యంచేస్తే మనసు మారిపోతుందేమో అని. అనుకున్న విషయాలు సాధారణంగా జరగవు అనుకోని విషయాలు ఆశ్చర్యంగా జరుగుతాయ్.

గోపాలం కథ పత్రికలో పడింది! అంతే కాదు. పదిరోజులు తిరక్కుండా పారితోషికం వచ్చింది.

కీటకు తెలిసిపోయిందనుకుని పొంగిపోయాడు అతని ఆలోచనలూ జీవితమూ క్రొత్త మలుపు తిరిగాయి

కలలు కనడం — వాటిని కథలుగా రాయడం.

గోపాలం కథల కాటేజిండస్ట్రీ పెట్టేశాడు.

గోపాలానికి జీవితం గురించి దాదాపు ఏమీ తెలియదు. అంతా స్వప్న ప్రపంచం. అందుకే అతని కథలు మామూలు పాఠకులకు ముచ్చటగా నచ్చసాగాయి. ఫోటోలో పేడకుప్పకూడా అందంగా కనిపిస్తుంది. వాస్తవంకంటె ఊహే మనిషిని ఊరిస్తుంది.

యౌవనంలో అడుగుపెట్టిన గోపాలానికి ప్రపంచం యావత్తూ ప్రేమమయంగా సాక్షాత్కరించడంలో అసహజమేమీ లేదు. ఆ వయస్సు అటువంటిది. ప్రేమ అనేది జీవితానికి పర్యాయపదం అనేసుకునే వయసు గోపాలానిది.

గోపాలం రొటీన్ మార్చేశాడు.

అందమైన అమ్మాయి కనిపించేవరకూ రోడ్లమీద తిరగడం—కనిపించాక యింటికి వచ్చి కళ్ళు మూసుకుని కలలు కనడం— తరువాత ఆ కలలని కథలుగా తర్జుమా చేయడం.

కథలమీద కొంచెం కిట్టుబాటు అవడం ప్రారంభించింది. వ్యవహారం లాభసాటిగానే కనిపించసాగింది నిరుద్యోగి జీవితంలో అమాంతం అర్జన ఆనందాన్నిస్తుంది.

'పూపూ—తాపీ' అన్న ప్రేమకథ హిట్టయింది. ఆ కథ ఎంత పాప్యులర్ అయిం

# ప్రేమలో ప్రమాదం

టంటే— కాలేజీ అమ్మాయిలూ అబ్బాయిలూ పత్రికకి —అటువంటి కథలే అస్తమానూ వేస్తూండాలని ఉత్తరాల పరంపరలు కురిపించారు. గోపాలానికి పర్సనల్ లెటర్స్ తెప్పించింది కథ. అంతవరకూ ఆర్డినరీ రైటరుమాత్రమే అయిన గోపాలం ఒక్కసారిగా పాపులర్ ప్రేమరచయిత అయిపోయాడు.

ఆకథ చదివే— శ్యామల చాలా ఇంప్రెస్ అయిపోయింది,

ఆ సాయంత్రం ... ముందర గదిలో కూర్చుని రాయబోయే కథకోసం పగటికలలు కంటున్నాడు గోపాలం.

కిటికీ అవతల గాజుల గలగలలు.

ఆశ్చర్యంగా చూశాడు గోపాలం.

అమ్మాయిలు నలుగురు. అందులో ఒక అమ్మాయి మహా అందంగా మెరిసిపోతోంది.

ఎక్కువ సినిమాలు చూసే గోపాలనికా అమ్మాయి తెరనుండి ఊడిపడి వచ్చిన తారలా కనిపించింది.

కథ(లు)రాసే గోపాలం— దివినుండి భువికి దిగివచ్చిన దేవత అంటే యిలాగే— ఈమెలాగే ఉంటుందనుకున్నాడు. కలలలో అమ్మాయిలా కనిపించింది గోపాలానికి.

'ఇక్కడ గోపాలంగారనే రచయిత...'

సిగ్గుతో మెలికలు తిరిగిపోయాడు పదరు గోపాలం. 'నేనేనండీ.' వీలా గోనోరు పెగుల్చుకున్నాడు. ఆ క్షణంలో కథకీ జీవితానికీ తేడా తెలిసినట్టయింది. కథలో పాత్రలచేత అయితే యిష్టంవచ్చిన డైలాగులు చెప్పించెయ్యొచ్చు. కాని— నిజజీవితంలో అలా కుదరదు. డైలాగూ, ఆక్షనూ అన్నీ అనుకోని తీరులో వస్తాయి.

కనుబొమ్మలు పైకెత్తి చూశారు నలుగురమ్మాయిలూ. అంటే—వారు ఆశ్చర్యమూ, ఆనందమూ ప్రకటిస్తున్నారన్న మాట!

గోపాలం తాళలేకపోయాడు. తట్టుకోలేకపోయాడు—అంతటి ఆనందం, ఆశ్చర్యం కలగలసిన అందరమ్మాయిల చూపులకి. తల వంచేసుకున్నాడు.

'మిమ్మల్ని కలుసుకోడం చాలా సంతోషంగా ఉంది. ఇంత చిన్నవయసులోనే ఎంత చక్కని కథలు రాస్తున్నారు! మీ కథలంటే మేము చెవి కోసుకుంటాం—'

'అలా అయితే నేను కథ(లు)రాయను.' జోకేశాడు గోపాలం. అమ్మాయిలకీ అర్థమైంది జోక. నవ్వారు.

వారిలో తారలా మెరుస్తున్న అమ్మాయి గోపాలం కళ్ళల్లోకి చూసి

'ఇక మేము వెళ్తాం -' అంది. ఆమె అలా అనడమేమిటి, నలుగురూ నిష్క్రమించారు.

వాళ్ళు వెళ్ళిపోయాక — ఏకాంతంలో ఎంత సేపో ఏడ్చుకున్నాడు గోపాలం.

'నువ్వొట్టి ఫూల్ వి గోపాలం. ఫస్ట్ క్లాస్ ఛాయిస్. అమ్మాయిలువస్తే ఊఁ తెగ సిగ్గుపడిపోయి—కనీసం లోపలకివచ్చి కూర్చోమనయినా అనలేదు. కాఫీ యివ్వలేదు. కబుర్లు చెప్పలేదు. పాత జోకొకటి వేశావు చచ్చీచెడీ.

నువ్వు చూసిన సినిమాలేమయిపోయాయ్?

నువ్వు చదివిన నవల్లెక్కడికిపోయాయ్?

నువ్వు రాసిన ప్రేమకథలు ఎక్కడికి పోయాయ్?

అందమైన అమ్మాయిలతో అలా గేనా ప్రవర్తించడం?' అంటూ కేకలేసి చీవాట్లు పెట్టింది అంతరాత్మ

గోపాలం లెంప లేసుకున్నాడు.

ఓ నాలుగురోజులు పశ్చాత్తాపంలో గడిపి— యిక అలా గడపలేక పార్కుకి బయలుదేరాడు.

పార్కులో ఎదురైంది ఆమె— అదృష్టవశాత్తూ ఒంటరిగా.

'క్షమించండి...మొన్న...'

ఆమె నవ్వింది.

మరో మెర్లిన్ మన్రో — అనిపించిందది గోపాలానికి. అతను చూసిన అమ్మాయిల అందమంతా నవ్వకుండా ఉన్నంతసేపే. పళ్ళు పైకి కనిపించేలా నవ్వినా అందంగా ఉండే మర్లిన్ మన్రోకోవ అమ్మాయిలు అరుదని గోపాలం నమ్మకం నవ్వుతున్నా అందంగానే ఉన్న ఈ అమ్మాయి అతన్ని యిట్టే ఆకట్టుకుంది.

'మర్యాదలు చెయ్యలేదనేగా? పరవాలేదు. రచయితలకి ఫార్మాలిటీస్‌నుంచి ఎగ్జెంప్షను. మరో కథ ఆలోచిస్తూ ఉండి ఉంటారప్పుడు.'

'కరక్ట్...సరిగ్గా అంతే.'

'అయితే—శ్రీ శ్రీ. షూరాకే మీకు అంత రాయం కల్గించి ఉంటుంది.'

'అబ్బే. ఏమీ లేదు. మీరాకతో మా గృహం పావనమైంది.'

'మీది గృహమా?'

నవ్వేశాడు గోపాలం. 'ఉహూ. వంద రూమే.'

'మీ కథలు బాగుంటాయి.'

'థాంక్స్. మీ లాంటి అభిమానురాలిని పొందగలిగాక నేను రచయితననే నమ్మవలసి వస్తోంది.'

అలా ప్రారంభం అయింది శ్యామలకీ గోపాలానికీ స్నేహం.

శ్యామల అందమైనది.

గోపాలం రచయిత.

ఇద్దరూ వయసులో ఉన్నారు. కనుక—పరిచయాలు స్నేహంగా, స్నేహం—ప్రేమగా చకచక ఎదిగిపోయింది. పెళ్లీడుకొచ్చిన ఆడపిల్లలా; కాబూలీవాలా అప్పులా.

ప్రేమ ప్రేమలా ఊరుకోలేదు. ఇంకా పైపైకి దిగిపోతానంది—థర్డ్‌క్లాస్ హోటళ్లలోనూ, సినిమా హాల్సులోనూ, పార్కులలోనూ, రోడ్లమీదా గోపాలం, శ్యామలా ప్రేమికుల ముద్రలు వయిగవేసుకున్నారు.

శ్యామల తండ్రి విలన్‌కాడు. కాదల్చుకోలేదు.

కంపెనీ వ్యవహారాలతో సతమతమౌతున్నా—ఓకంట నాగరికతా, మనుషులూ ఎలా మారుతున్నారో కనిపెడుతూనే వస్తున్నాడాయన.

అదీకాక పద్దెనిమిది నిండిన అమ్మాయి ఫ్రీగా, ఫ్రాంక్‌గా—'నేను గోపాలం అనే రచయితని ప్రేమించాను. ఈ విషయం మీకు తెలుసో తెలియదోగాని యూనివర్సిటీలో చాలా మందికి తెలుసు. కనుక తమరు కర్తవ్యం ఆలోచించండి' అని అల్టిమేటమ్ ఇష్యూ చేసేసరికి ఆయనకి శ్యామల పెళ్లి చెయ్యడం అత్యవసరం అనిపించింది. తాను అల్లుణ్ని వెదకడం అనేది పాతపద్ధతి అనీ శ్యామల జీవన సహచరుడిని అన్వేషించుకోడం నవీన నాగరికత అనీ సరిపెట్టుకుని—గోపాలం గురించి అడిగాడు.

'అతను—బి. ఏ. పాసయ్యాడు. నిరుద్యోగి. కథలు బాగా రాస్తాడు. బోలెడు పాపులారిటీ, అతనికి నా అన్నా ప్రాణంగా ఉంది—'

'బాగుందమ్మా, నీ సెలక్షను అతి చక్కగా ఉంది. కాని—అతను కథలు రాస్తుంటాడన్నావు మరి.'

'పరవాలేదు నాన్నా, అది మరీ విచారించవలసిన డిస్క్వాలిఫికేషను కాదులే.'

'మనలో కలిసి పోగలడంటావా?'

'ఇప్పటికే కలిసిపోయాడు నాన్నా!' అంది శ్యామల

* * *

ప్రేమకూడా అదృష్టంలాంటిదే అందలం ఎక్కించగలదు — అనుకోక తప్పలేదు గోపాలం.

నిరుద్యోగి గోపాలం—'రవి ప్రొడక్ట్స్'కి జనరల్ మానేజరయ్యాడు. రూములో ఉండే గోపాలం—ఇంటివాడయ్యాడు. గోపాలం మామగారిది పెద్ద యిల్లు ... భవనం.

ఒంటరి గోపాలం—'జంట'లో పార్ట్నర్ అయ్యాడు.

కాలినడకన గోపాలం — కారువాలా అయ్యాడు.

ఒకటేమిటి? అన్ని విధాలా గోపాలం మారిపోయాడు.

'లక్కీ ఫెలో' అని అభినందించారు గోపాల్ని మిత్ర బృందం.

గోపాలం స్టేటస్ పెరిగి పోయింది

పెళ్లికి ముందు వింత ఫ్రీ లైఫ్ గడిపాడు—పెళ్లయ్యాక అంత కాస్ట్లీ లైఫ్ ఖిం పిందలగికి.

తొలి రోజులలో ఇవన్నీ చక్కగానే ఉండేవి గోపాలానికి. కాని—

కొన్ని నిజాలు కాలక్రమంలో శక్తిని కోల్పోయి అబద్ధాలలాగా కనిపించడం మొదలు పెడతాయి కాబోలు.

ఇవాళ ఏదయితే పరమసత్యం అని పిస్తుందో—అది రేపటికి పచ్చి అబద్ధంలా కనిపిస్తే ఆశ్చర్యపోనవసరంలేదు. కాలాని కున్న అనేక శక్తులలో యిదీ ఒకటి.

కొత్త జీవితంలో—అతిత్వరగానే ఏదో లోటు కనిపించసాగింది గోపాలానికి. నిజంగా తను సుఖపడటంలేదేమో అన్న అనుమానం పొడచూపసాగింది.

ఐశ్వర్యం — అందంగా వున్న సుఖాలనూ యివ్వదు.

గోపాలానికి కొత్త జీవితంలో మోజు తగ్గింది.

అభిమానులూ పాఠకులూ వస్తే డ్రాయింగ్ రూములో ఖరీదయిన సోఫాలో కూర్చోబెట్టి కూల్‌డ్రింక్సిచ్చి మర్యాద చేసేవాడు, కాని — ఎందుకో మనసువిప్పి మాట్లాడలేకపోయేవాడు. వాతావరణమూ, పరిసరాలూ వీటిలో ఏదో అసహజత్వం నిండినట్లనిపించేది. అంతకంటె నలుగురైదుగురు వస్తే— రూములో కాఫీకో ఏ పార్కులోకో వాళ్లతోపాటు వెళ్లి చెప్పుకోడమే ఎక్కువ హాయిగా తోచేది. వర్తమానంకంటె, వచ్చేకాలముకంటెకూడా గతకాలమే మేలేమో అన్న సంశయాలకి చోటు



# కొన్నిసామాన్య వ్యాధులకు పథ్యా పథ్యములు

## మదాత్యయరోగముగలవారికి

**పథ్యాపథ్యములు :—** అతిమద్యపానం వల్ల జనించెడి రోగాలకు మదాత్యయరోగాలని అంటారు.

**పథ్యములు:—** మంచి ప్రాతబియ్యపు అన్నం, బార్లీబియ్యపు అన్నం, గోధుమ అన్నం తినవచ్చును. పులగం తినవచ్చును. పెసలు, మినుగులు వీనితో చేసే పదార్థాలు తినవచ్చును. పంచదార కలుపుకొని పాలు త్రాగవచ్చును. ఆవుమజ్జిగా అన్నం తినవచ్చును. మిక్కిలి ప్రియమైన మద్యం తగు మోతాదులో త్రాగవచ్చును. పొట్లకాయకూర, బీరకాయకూర చిర్రికూర తినవచ్చును. ద్రాక్ష, దానిమ్మ, దబ్బ, నిమ్మ, మాదీ, పొలసా, ఖర్జూర, ఉసిరిక ఫలములు తినవచ్చును. కొబ్బరికాయ నీళ్ళు త్రాగవచ్చును. కొబ్బరి తినవచ్చును. మేక, జింక, కుందేలు, లావుకపిట్ట, తిత్తిరిపిట్ట మొదలైన వాని మాంసములు తినవచ్చును. చల్లని నీరు త్రాగవచ్చును. చల్లని గాలిలోను, వెన్నెలలోను తిరుగవచ్చును. పరుండవచ్చును. శరీరానికి చందనం పూసుకోవచ్చును. మైథునం, నిద్ర, వ్యాయామం అవసరం.

**అపథ్యములు:—** క్రొత్త బియ్యపు అన్నం తినకూడదు. కందిపప్పు, ఉలవపప్పు —వీని కట్టు తినకూడదు. మానెపిండి వంటలు— ఆవ, వెల్లుల్లి మొదలగు కాక పైత్యకర పదార్థములు తినకూడదు. కోడిమాంసం తినకూడదు. పొగ త్రాగడం, తాంబూలం వెయ్యడం, పుల్లతో పళ్ళు తోమడం మానెయ్యాలి.

## ఆమపైత్యరోగులకు

**పథ్యములు:—** కడుపులోగాని, చెమ్ములోగాని మంట, బాధ కలిగి ఉండెడి రోగానికి ఆమపైత్యమంటారు. ఈ రోగంగలవారు ప్రాతబియ్యపు అన్నం, గోధుమ అన్నం, బార్లీ బియ్యపు అన్నం తినవచ్చును. పెసర పప్పు, కందిపప్పు— వీనికట్టు అన్నంలో కలుపుకొని తగుమాత్రం నెయ్యి వేసుకొని భుజించవచ్చును. పంచదార తినవచ్చును. తేనె త్రాగవచ్చును. పేలాల గంజి త్రాగవచ్చును. అల్లం తింటూండడం మంచిది. పొట్లకాయకూర, బీరకాయకూర, లేతమునగకాయ కూర, గుమ్మడికాయకూర, నక్కదోసకాయకూర, పొట్టికాకరకాయ కూర, ఉస్తికాయకూర, అరటిపువ్వుకూర, చక్రవర్తి కూర తినవచ్చును. ఉస్తివరుగు, బుడమవరుగు తినవచ్చును. ఆవుమజ్జిగా అన్నం తినవచ్చును. మేకమాంసం తినవచ్చును. దాహమయినప్పుడు బాగా మరిగించి చల్లార్చిన పరిశుద్ధమైన నీరు త్రాగడం శ్రేయస్కరం.

**అపథ్యములు:—** క్రొత్తబియ్యపు అన్నం, గురుకరాన్నం తినకూడదు. ఉలవ పప్పుతో చేసే పదార్థాలేవీ తినకూడదు. ఉప్పు, పులుపు, కారం కూరలలోను, పప్పులలోను బాగా తగ్గించెయ్యాలి. పుల్లని పెరుగు, మజ్జిగ త్రాగకూడదు. పుల్లని పళ్ళు తినకూడదు. చేపలు తినకూడదు. అన్నంలో మానె వేసుకోకూడదు. చేపలు తినకూడదు. మానెపిండి వంటలు తినడం మానెయ్యాలి.

## గాయములు బలముగు కవుకుదెబ్బలు తగిలినవారికి

**పథ్యములు:—** తగు మోతాదులో బ్రాందీ లేదా సారాయి దెబ్బలు తగిలిన తరువాత ఒకటి రెండుసార్లు త్రాగవచ్చును. ప్రాత బియ్యపు అన్నం, గోధుమ అన్నం, గోధుమ రొట్టెలు తినవచ్చును. నెయ్యి వేసుకొని భుజించవచ్చును. పొట్లకాయకూర, బీరకాయ కూర, కందకూర, కొయ్యతోటకూర, మునగ ఆకుకూర తినవచ్చును. మేకమాంసం, కోడిమాంసం వీని రసములు అన్నంలో కలుపుకొని తినవచ్చును. అడవి మృగ పక్షుల మాంసములు తినవచ్చును. మంచి విశ్రాంతి అవసరం.

**అపథ్యములు:—** క్రొత్త బియ్యపుఅన్నం చల్దన్నం తినకూడదు. కంది, పెసర, మినప మొదలగు పప్పులు తినకూడదు. కరుబూజా, దోస, దబ్బ మొదలగు శీతలకర ఫలములు, మజ్జిగ, పెరుగు, కలి, పులికడుగు, పులుసు మొదలగు శీతలకర పదార్థములు భుజించకూడదు. గాలిలోను, మంచులోను, వెన్నెలలోను తిరగడం పడుకోవడం— విశ్రాంతి లేకుండా పని చెయ్యడం, మైథునం, స్నానం అభ్యంజనం మానెయ్యాలి. కోపం, విచారం మొదలగు మనోవికారాలకు లోను కాకూడదు.

**సేకరణ : ఆకుండి నారాయణమూర్తి**

# ప్రేమలో ప్రమాదం

దొరికేసింది గోపాలం ఆలోచనలలో.

శ్యామల విషయంలోమాత్రం గోపాలం చెక్కు చెదరలేదు. అంత అందమైన అమ్మాయి తనకి దొరకడం జన్మజన్మల వరం— అనే భావన అతనిలో అప్పటిలాగే ఉంది.

గోపాలానికి మామగారిమీద కొంచం మంట ఉండేది.

శ్యామల నెపంగా— తనను కంట్రోల్ చేస్తున్నది ఆయనే అని గోపాలం అనుమానం.

పెళ్లయిన మూడునెలలకే గోపాలం స్టేటస్ మరోమెట్టు పెరిగే సూచనలు కనిపించేశాయి. ఆ స్టేటస్— అంతత్వరగా పెరగడం యిష్టంలేదు గోపాలానికి.

'వద్దు శ్యామలా! ఇంత త్వరగానా? నాలుగైదేళ్లు పోనీ. ఇప్పటికి మించిపోయిందేమీ లేదు. ఏ లేడీ డాక్టరయినా...'

'నాన్న చంపేస్తాడు...'

గోపాలం అహం దెబ్బతింది.

'ఇది— మన విషయం శ్యామలా' కటువుగా అన్నాడు గోపాలం.

శ్యామల విషయంలో ఆమాత్రం కఠినంగా మాట్లాడ్డం అదే మొదటిసారి.

'మనవడికోసం నాన్న ముచ్చట పడుతున్నాడు. ముసలాయన కోరికను కాదనడం దేనికి?'

'మరి...నా గురించి ఆలోచించవా?'

'నేనెప్పటికీ మీ శ్యామలనేగా?!

'తల్లినయ్యాక నీకీ అందమూ ఉండదు చలాకీ తనమూ ఉండదు.'

'మాతృత్వం స్త్రీ అందాన్ని యినుమడింపజేస్తుంది.' అరిందాలా అది శ్యామల.

ఇక ఏమీ అనలేదు గోపాలం. మన్నితంగా సూచించడమే తప్ప శాసించడం అనే లక్షణం అతని రక్తంలోనూ లేదు, నైజంలోనూ లేదు.

క్రమక్రమంగా అతనిలో మార్పు రాసాగింది. ఆ మార్పు—అతనికి శ్యామలమీద ఉన్న ప్రేమని మాత్రం ముట్టలేకపోయింది.

మామగారి గౌరవం నిలుపడం కోసం— మైత్రుల్ని వదులుకున్నాడు.

(ముగింపు వైవారం)

# ఇప్పుడు
# ఎంత చక్కటి నునుపు !
# విలియమ్స్
# స్టెయిన్‌లెస్ స్టీలు బ్లేడుతో !

మీకుబాధకలిగించి, మీచర్మాన్నికోసి, మీఅహాన్ని దెబ్బతీసే బ్లేడులకు ఇకస్వస్తి చెప్పండి. ఇంతవరకూగడ్డం చేసుకోడం రోజూఒక పెద్దబెడదే.
ఇప్పుడు, క్రొత్తవిలియమ్స్ స్టెయిన్‌లెస్ స్టీలు బ్లేడుతో అలాకాదు. ఇక మీగడ్డం ఎప్పుడూనల్లగా వుండదు. గరుకుదనం, నాట్లు పడటం, బాధకలగటం ఇక జరగవు.
అవును, మళ్ళీ అతి చక్కటి నునుపు ! విలియమ్స్ స్టెయిన్‌లెస్ స్టీలు బ్లేడుతో !






Creative Unit-344-Tel.




### జరిగిన కథ

రామమూర్తికి ఇద్దరు కొడుకులూ ఒక కూతురూను. భార్య కాంతమ్మ రోగిష్టిది. కొడుకులిద్దరిమీదా ఎన్నో ఆశలు పెట్టుకుని — వాళ్లకి ఏ లోటూ జరక్కుండా పెంచి పెద్ద చేశాడు. కాని, కొడుకుల ప్రవర్తన అతను ఆశించినట్టు లేదు. పెద్ద కొడుకు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. దాని ఫలితంగా రామమూర్తి ఉద్యోగమే పోయింది. రెండవ కొడుకు చిట్‌ఫండ్ కంపెనీకి సంబంధించిన డబ్బు పట్టుకు పోయాడు. దానివల్ల రామమూర్తి జైలుకు పోవలసి వచ్చింది. రామమూర్తి దయాదాక్షిణ్యాలతో పెరిగిన రజనీకుమార్ ఆ కుటుంబాన్ని ఆదుకున్నాడు.

## 19

ఇంటర్నేషనల్ ఆర్ట్స్ సొసైటీవారు నిర్వహించిన పోటీలో రజనీకుమార్ పంపించిన చిత్రానికి మొదటి బహుమతి వచ్చింది.

ఆ వర్తమానం తెలియగానే రజనీకుమార్ వెళ్ళి బోసుగారికి నమస్కరించాడు. రజనీకుమారుకు మొదటిబహుమతి వచ్చినందుకు బోసు చాలా సంతోషించాడు.

మిగిలిన విద్యార్థులు రజనీకుమారును అభినందించారు.

మద్రాసులో ఉంటున్న రజనీకుమారుకు యింటర్నేషనల్ ఆర్ట్స్ సొసైటీవారు నిర్వహించిన పోటీలో మొదటిబహుమతి వచ్చింది కాబట్టి అతనికి సన్మానం చేయడానికి మద్రాసు ఆర్టిస్టులు తీర్మానించుకొన్నారు.

రజనీకుమార్, బోసువద్ద ఉన్నప్పుడు క్లబ్బు సెక్రెటరీ అతన్ని కలుసుకొని తమ తీర్మానాన్ని గురించి చెప్పాడు.

చిన్నతనం కావడంవలన రజనీకుమార్, తనకు సన్మానం చేస్తామని క్లబ్ సెక్రెటరీ చెప్పగానే సిగ్గుపడ్డాడు. కాని బోస్ ప్రోత్సహించడంవలన సన్మానం చేయించుకోవడానికి అంగీకరించాడు.

'వచ్చే ఆదివారం సాయంత్రం నాలుగ్గంటలకు క్లబ్ భవనంలోనే సన్మానం యేర్పాటు చేస్తా'మని చెప్పి వెళ్ళిపోయాడు క్లబ్ సెక్రెటరీ.

* * *

'చెప్పి, చెప్పి నానోరు నొప్పెట్టడమే, కాని, మీరు మాత్రం నిమ్మకు నీరెత్తినట్లుగా ఊరుకున్నారు' అంది అన్నపూర్ణమ్మ.

'ఊరుకోక, యేం చెయ్యమంటావు? తెలిసున్న వాళ్ళందరకూ ఉత్తరాలు రాస్తున్నాను. ఏవో సంబంధాలు ఉన్నాయని కొంతమంది ఉత్తరాలు రాస్తున్నారు. వాటిని గురించి భోగట్టా చేయమని మరి కొంతమందికి ఉత్తరాలు రాస్తున్నాను. మనం తొందరపడితే అవుతుందా?' అన్నాడు కాశీ విశ్వనాథం.

'మాట్లాడితే ఉత్తరాలు రాశానని మాత్రం అంటారు' అన్నది అన్నపూర్ణమ్మ విరక్తితో.

'ఉత్తరాలు రాయకపోతే, ఊరేగమంటావా?'

'ఊరేగమని అనడంలేదు. అప్పుడప్పుడు యేదో ఊరువెళ్ళి స్వయంగా వెదకమంటున్నాను'

'ఏ ఊరువెళ్ళి, వెతికినా, అమ్మాయికి వచ్చేమొగుడు దొరకుతాడేమోకాని అన్నపూర్ణమ్మగారికి నచ్చే అల్లుడు మాత్రం దొరకడు. అల్లుడు చదువుకున్నవాడై ఉండాలి. బుద్ధిమంతుడై ఉండాలి. డబ్బున్నవాడై ఉండాలి. ఉద్యోగం చేస్తుండాలి కాని ఆ ఉద్యోగంలో ఊళ్ళు తిరగవలసిన అవసరం ఉండకూడదు, ఎక్కువ బాధ్యత కలిగిన ఉద్యోగం కాకూడదు. కాని జీతం మాత్రం యెక్కువే ఉండాలి. ఆ కుటుంబానికి పెద్ద పేరు ప్రఖ్యాతులు ఉండాలి కాని అల్లుడికి యెక్కువమంది అన్నదమ్ములు, అక్కలూ, చెల్లెళ్ళూ ఉండకూడదు. ఇన్ని లక్షణాలు కలిగిన అల్లుడు యెలాగా ఉండడు కాబట్టి అన్నపూర్ణమ్మగారికి నచ్చేటటువంటి ఒక అల్లుణ్ణి సృష్టించమని బ్రహ్మదేవుడికే ఒక అర్జీ దాఖలు చేద్దామనుకొంటున్నాను' అన్నాడు కాశీ విశ్వనాథం గుక్కతిప్పుకోకుండా.

భర్త మాటలు వింటుంటే అన్నపూర్ణమ్మకు నవ్వువచ్చింది కాని దాన్ని ఆపుకొని 'ఏమండీ! అమ్మాయి మొగుడు నా అల్లుడే కాని మీ అల్లుడు కాడా? అయినా, ఒక్కగానొక్క పిల్లను యేమీ చూడకుండా, ఎవడో దారిని పోయేవాడికి యిచ్చేస్తామా?' అని ప్రశ్నించింది.

'ఏం? అమ్మాయిని దారిని పోయేవాడికి కాకుండా, దారికి అడ్డంగా వెళ్ళేవాడికి యిస్తానా? దారినిపోయేవాడు అంటే, అందరిలాగే మామూలుగా ఉండేవాడన్న మాట. దారినిపోయేవాడు కాదంటే, దారికి అడ్డుగా వెళ్ళేవాడన్నమాట. అంటే వెర్రి వెర్రి వేషాలు వేసేవాడన్నమాట. అందుచేత అమ్మాయిని దారిని పోయేవాడికి యిస్తావో, దారికి అడ్డంగా వెళ్ళేవాడికి యిస్తావో, ఆలోచించుకో' అన్నాడు కాశీ విశ్వనాథం.

'నేనేదైనా అంటే, యిలాగే యేవో తమాషా మాటలు చెబుతుంటారు. మీ మాటలు నాకు కొత్త గనుకనా? కాపురానికి వచ్చినప్పటినుంచీ వింటూనే ఉన్నాను' అన్నది అన్నపూర్ణమ్మ.

ఇంతలో 'నాన్నగారూ!' అంటూ సరళ యింట్లోనికి వచ్చింది.

సరళను చూడగానే, కాశీవిశ్వనాథం అన్నపూర్ణమ్మా తమ సంభాషణను అక్కడితో ఆపుచేశారు

'మీకు యేదో కవరు వచ్చింది' అని అంటూ సరళ తండ్రిచేతికి ఒక కవరు యిచ్చింది.

కాశీవిశ్వనాథం కవరు విప్పి చూశాడు.

'రేపు సాయంత్రం క్లబ్బులో యేదో సన్మానసభ ఉందట. దానికి ఆహ్వానం.'

'ఏది? నన్ను చూడనివ్వండి' అంటూ సరళ తండ్రిచేతిలోఉన్న కవరు తీసుకొని చదివింది.

'నాన్నగారూ! రజనీకుమారుకు సన్మానం అట. అతను గీసిన బొమ్మలు చాలా బాగుంటాయి. ఎన్నోసార్లు పత్రికల్లో పడ్డాయి కూడాను. రేపు సాయంత్రం నేను కూడా మీతో రావద్దూ?' అని తండ్రిని బ్రతిమాలింది సరళ.

'తప్పకుండాను. మనకోసం యెప్పుడూ రెండు సీట్లు రిజర్వుచేసి ఉంచుతారు.'

'ముందు యెప్పుడూ యిలాగే అంటారు తీరా సమయం వచ్చేసరికి 'అమ్మా! నాకు అర్జంటుపని వచ్చింది నేను వేరేచోటుకు వెళ్ళాలి. మళ్ళీసారి నిన్ను తప్పకుండా తీసుకొని వెడతాను' అని చెప్పి వెళ్ళిపోతారు' అని సరళ తండ్రిమాటలను అనుకరిస్తూ అన్నది.

కూతురు మాటలకు తల్లితండ్రులు యిద్దరూ నవ్వారు.

'లేదమ్మా, రేపు క్లబ్బుకు నిన్ను తప్పకుండా తీసుకొని వెడతాను' అన్నాడు కాశీ విశ్వనాథం.

'సరే, చూద్దాంగా' అంటూ సరళ లోపలకు వెళ్ళిపోయింది.

మర్నాడు మధ్యాహ్నం రెండుగంటలకు కాశీవిశ్వనాథం యెక్కడకో వెళ్ళడానికి బయల్దేరుతున్నాడు.

'ఒక్కనిముషం ఉండండి! కాఫీ తెస్తాను' అని అన్నపూర్ణమ్మ అనడంవలన కాశీ విశ్వనాథం అక్కడ ఉన్న ఒక సోఫాలో కూర్చున్నాడు.

అంతలో సరళ 'నాన్నగారూ! నాన్నగారూ! మళ్ళా యెంతసేపట్లో వస్తారు?'



అని అడుగుతూ తండ్రి దగ్గరకు వచ్చింది.

'ఎయిర్ పోర్టుకు వెడుతున్నాను. మూడున్నరకు వచ్చే విమానంలో ఒక స్నేహితుడు వస్తున్నాడు. అతన్ని కల్సుకొని, హోటల్లో దించిరావాలి తిరిగి వచ్చేసరికి అయిదు కావచ్చును' అన్నాడు కాశీ విశ్వనాథం

'మరి నాలుగ్గంటలకు క్లబ్బులో సన్మాన సభకు వెడదామన్నారు'

'అవునమ్మా! ఆ సంగతి మర్చిపోయాను అతను పొద్దున్న ఫోనుచేసి, తాను విమానంలో వస్తున్నట్లూ, ఎయిర్ పోర్టులో తనను తప్పకుండా కలుసుకొమ్మని చెప్పాడు. నేను 'సరే' అన్నాను అప్పుడు నేను యీ సన్మానసభ మాటే మరచిపోయాను. పొద్దున్న వస్తానని చెప్పి యిప్పుడు ఎయిర్ పోర్టుకు వెళ్ళకపోతే, బాగుండదు'

'మీరు యిలాగే యేదో కారణం చెప్పి తప్పించుకుంటారని నేను నిన్ననే చెప్పాను' అన్నది సరళ నిష్ఠూరంగా.

'ఇప్పుడు మాత్రం యేమమ్మా? నువ్వు క్లబ్బుకువెళ్ళి ఉండు నేను కొంచెంసేపు అయిన తరవాత వస్తాను'

'నేను ఒక్కర్తెనూ వెళ్ళను' అన్నది సరళ ఖచ్చితంగా

'ఇదుగోనండి కాఫీ!' అంటూ అంతలో అన్నపూర్ణమ్మ కాఫీ తీసుకొని వచ్చింది.

కాశీ విశ్వనాథం కాఫీ అందుకుంటూ 'పోనీ, మీ అమ్మా, నువ్వూ వెళ్లండి'

# అనగనగా...

అన్నాడు.

'ఈ సభలూ, అవీ మీ తండ్రీకూతుళ్ళకే గాని నాకు సరిపడవు అందులోనూ యిప్పుడు నాకు తలనొప్పిగా గూడా ఉంది' అని స్పష్టంగా తేల్చేసింది అన్నపూర్ణమ్మ.

'అయితే. మీ స్నేహితురాళ్ళను యెవరి నయినా తీసుకొని వెళ్ళు! దానికి యింత ఆలోచించడం యెందుకు?' అన్నాడు కాశీ విశ్వనాథం కాఫీతాగుతూ.

'వాళ్ళందరూ, పొద్దున్నే మహాబలిపురం వెళ్ళారు ఫోనుచేసి, నన్నూ రమ్మన్నారు. కాని నేను సన్మానసభకు వెడతాను రానని చెప్పాను' అన్నది సరళ ముభావంగా.

అంతలో కాశీవిశ్వనాథానికి మెరుపులాగ ఒక ఆలోచన వచ్చింది, వెంటనే అతను 'మాణిక్యం! మాణిక్యం!' అని పిలిచాడు.

'ఏం బాబూ?' అంటూ మాణిక్యం లోపలనుంచి వచ్చింది.

'కుమారస్వామిని ఒకసారి పిల్చుకుని రా!' అని మాణిక్యంతో చెప్పాడు కాశీవిశ్వనాథం.

కుమారస్వామిని పిలవడానికి మాణిక్యం వెళ్ళింది

'ఇప్పుడు కుమారస్వామి యెందుకండీ?' అని అడిగింది అన్నపూర్ణమ్మ.

'వెనుకసీట్లో కూర్చుని కుమారస్వామి క్లబ్బువరకు అమ్మాయికి తోడుగా వెడతాడు క్లబ్బులోపల మన సోమసుందరం ఉండనే ఉంటాడు. అతను యిప్పుడు క్లబ్బు ప్రెసిడెంటు కూడాను. మధ్యలో నేను వెడితే, వెడతాను లేకపోయినా, సభ అయి పోయేవరకూ కుమారస్వామి కారువద్ద ఉంటాడు కాబట్టి తిరిగి యిద్దరూ వచ్చేయవచ్చును' అన్నాడు కాశీ విశ్వనాథం.

తండ్రి చెప్పినమాటలు సరళ విని ఊరుకుందిగాని యేమీ మాట్లాడలేదు.

*   *   *

రజనీకుమార్ తన సన్మాన సభకు తాతయ్యను కూడా తీసుకొని వెడదామను కొన్నాడు కాని అతను ఆ విషయం తాతయ్యతో చెప్పలేదు.

ఏమీ చెప్పకుండా తాతయ్యను సభకు తీసుకొని వెడితే, అక్కడ జరిగే సన్మానం అతనికి అపరిమితమైన ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తుందని రజనీకుమార్ అనుకున్నాడు

సభకు వెళ్లే సమయం దగ్గర పడింది కాబట్టి 'మంచిబట్టలు వేసుకో'మ్మని తాతయ్యతో చెబుదామని రజనీకుమార్ అనుకుంటుండగా అతనికి బయటనుంచి 'కుమారస్వామీ' అనే పిలుపు వినబడింది.

'ఏం మాణిక్యం?' అంటూ కుమార స్వామి బయటకు వచ్చాడు.

'బాబుగారు నిన్ను యెందుకో రమ్మన్నారు' అని చెప్పి వెళ్ళిపోయింది మాణిక్యం.

'కాశీవిశ్వనాథంగారు యీ సమయంలో తనను యెందుకు రమ్మన్నారా?' అని ఆలోచించుకుంటూ కుమారస్వామి కాశీ విశ్వనాథంగారి వద్దకు వెళ్లాడు

'అమ్మాయిగారు యిప్పుడు క్లబ్బుకు వెడతారు. కూడా నువ్వువెళ్ళు' అన్నాడు కాశీ విశ్వనాథం.

'క్లబ్బుకు అమ్మాయిగారు యెందు కండీ? యేం టిఫిన్‌కావాలో. కాగితంమీద రాసియిస్తే నేను క్షణంలో తెచ్చేస్తాను' అన్నాడు కుమారస్వామి, క్లబ్బు అనగానే కాఫీక్లబ్బు అనుకొని కుమారస్వామి అమాయ కత్వానికి అందరూ నవ్వారు.

'క్లబ్బు అంటే కాఫీ క్లబ్బుకాదులే, అక్కడ ఒకసభ జరుగుతుంది దానికి అమ్మాయిగారు వెడుతున్నారు' అన్నాడు కాశీ విశ్వనాథం నవ్వు ఆపుకొని.

'అమ్మాయిగారు సభలకు వెళ్లడం



అసలు మంచిదికాదండీ. మా ఊళ్ళో ఒకసారి సభ జరిగితే, రాళ్ళు విసిరారండి దానితో జనం అంతా పారిపోయారు. ముగ్గురికి పెద్ద దెబ్బలుకూడా తగిలాయండి' అన్నాడు కుమారస్వామి యింకా అమాయకంగా.

అతని సలహా విని అందరూ నవ్వారు.

'ఈసభ అటువంటి సభకాదులే. రజనీ కుమార్ అని బొమ్మలువేసే అతనికి సన్మానం చేస్తున్నారు. దానికి యీ సభ. దీనిమీదకు యెవ్వరూ రాళ్ళు విసరరు. నువ్వేం భయపడనక్కరలేదు' అన్నాడు కాశీ విశ్వనాథం కుమారస్వామికి ధైర్యంచెపుతూ.

'అలాగాండీ?' అన్నాడు కుమారస్వామి ఆశ్చర్యపోతూ.

ఈ పరిస్థితినుంచి బయటపడటం యెలాగో అతనికి తెలియలేదు.

అంతలో కాశీవిశ్వనాథం 'కుమారస్వామీ! అమ్మాయిగారికి తోడుగా నువ్వు క్లబ్బు సభకు వెళ్ళు, అమ్మాయిగారు క్లబ్బు లోపలకు వెడతారు. నువ్వు కారుదగ్గర ఉండు! అమ్మాయిగారు క్లబ్బు లోపలనుంచి తిరిగి రాగానే సరాసరి యింటికి వచ్చెయ్యండి! ఏమైనా ఆలస్యం జరిగిందంటే నీ చెవులు మెలేసేస్తాను. జాగ్రత్త!' అని హెచ్చరించాడు.

ఆ మాటలు తెల్లబోయి వినడం తప్ప యింకేం చెయ్యాలో కుమారస్వామికి తోచలేదు.

'కొంచెం సేపట్లో అమ్మాయిగారు బయల్దేరతారు. ఈలోపున నువ్వు ముఖం కడుక్కొని సిద్ధంగా ఉండు'

కుమారస్వామి అంతలో కొంచెం తర్చుకొని 'ఏమండీ?' అంటూ యేదో చెప్పబోయాడు.

కాని కాశీ విశ్వనాథం వెంటనే అతని మాటలకు అడ్డువచ్చి 'ఇంక నువ్వేం సణపోలు చెప్పనక్కరలేదు. నేను చెప్పినట్లు చెయ్' అని గట్టిగా చెప్పి ఏయిర్‌పోర్టుకు వెళ్ళిపోయాడు.

ఇక చేసేదేమి లేకపోవడంవల్ల కుమారస్వామి తాతయ్య యింటివైపు బయల్దేరాడు.

'తొందరగా, రా' అని అన్నపూర్ణమ్మ వేసిన కేక వెనకనుంచి అతనికి వినిపించింది.

కుమారస్వామికి అప్పుడు యెన్నో ఆలోచనలు వచ్చాయి:

'తన సన్మానసభకు తాతయ్యను తీసుకొని వెడదామనుకొన్నాడు కాని అది యిప్పుడు కుదరదు. సరళ ఆ సభకు వచ్చినట్లయితే నిజంగా తానెవర్తెనదీ ఆమెకు తెలిసిపోతుంది. దానివల్ల యిబ్బంది కలుగుతుంది.

పోనీ తనే ఆ సభకు వెళ్ళడం మానేస్తే అసలు సభే ఆగిపోతుంది. బోసుగారికి తన మీద చాలాకోపం వస్తుంది. అందుచేత తను ఆసభకు తప్పకుండా వెళ్ళాలి.

వీటినిబట్టి చూస్తే యిక ఒకటే మార్గం కన్పిస్తున్నది. దానితో ఏవో మాటలు చెప్పి సరళను ఆసభకు వెళ్ళకుండా చెయ్యాలి. అది సాధ్యం అవుతుందా? సాధ్యమో, అసాధ్యమో ప్రయత్నం చేసి

చూద్దాం. ఆ తరువాత భగవంతునిదే భారం' అనుకున్నాడు కుమారస్వామి.

కాంచెం సేపట్లోనే మాణిక్యం వచ్చి 'కుమారస్వామి! అమ్మాయిగారు రమ్మంటు న్నారు' అని చెప్పింది.

మంచి బట్టలజత ఒక సంచిలో పెట్టు కొని బయల్దేరాడు కుమారస్వామి.

'త్వరగారా! వెనుకసీట్లో కూర్చో! అని కేకవేసింది అన్నపూర్ణమ్మ

కుమారస్వామి వచ్చి వెనుకసీట్లో కూర్చోగానే సరళ వచ్చి స్టీరింగు దగ్గర కూర్చుంది

'త్వరగా వచ్చెయ్!' అని కూతురును హెచ్చరించింది అన్నపూర్ణమ్మ.

'అలాగే, బై. బై' అని తల్లితో చెప్పి, కారు స్టార్టుచేసింది సరళ.

కారు కదిలిన తరువాత 'ఏం మాట్లాడాలా?' అని ఆలోచిస్తున్నాడు కుమారస్వామి.

ఇంతలో సరళ 'సంచితో యేమిటి తెస్తున్నావుస్వామీ?' అని ప్రశ్నించింది

సరళే ముందుగా మాట్లాడడం కుమార స్వామికి ప్రోత్సాహాన్ని యిచ్చింది.

'బోసుగారి శిష్యుడుకోసం బట్టలు తెస్తున్నానండి! దారిలో కన్పిస్తే యిచ్చేస్తాను అన్నాడు కుమారస్వామి

'అంతేనా! రజనీకుమారుకు యేదైనా బహుమతి తెస్తున్నారేమో అనుకున్నాను'

రజనీకుమారు పేరు ముందుగా సరళే ప్రస్తావించడం వలన తను మాట్లాడ్డానికి అవకాశం లభించిం'దనుకొన్నాడు కుమార స్వామి

'రజనీకుమార్ అంత గొప్పవాడాండీ?' అని సరళను అడిగాడు కుమారస్వామి. యెంతో అమాయకంగా.

'రజనీకుమార్ గొప్పవాడా అని మెల్లగా అడుగుతున్నావా? బొమ్మలు గీయడంలో అతనికి యెన్నో బహుమతులు వచ్చాయి. అతను గీసిన బొమ్మల్లో జీవకళ ఉంటుంది'

'మీరేమో, అతను యేదో గొప్పవాడని అంటున్నారు కానండి! నాకు మాత్రం అతను గొప్పవాడిలా కన్పించలేదండి!'

'రజనీకుమారును నువ్వు చూశావా? యెక్కడ చూశావు?' అని ఆత్రుతగా ప్రశ్నిం చింది సరళ.

# అనగనగా...

'బోసుగారి దగ్గర చూశానండి! వట్టి వికారంగా ఉంటాడు చూసేసరికి వాంతి వచ్చేలాగ ఉంటాడండి!' అన్నాడు కుమార స్వామి రజనీకుమారును తిట్టడానికి యిదే అదును అనుకొని.

'రజనీకుమార్ అంత వికారంగా ఉంటాడా?' అని తిరిగి వెంటనే ప్రశ్నించింది సరళ.

'అందంగా బొమ్మలు గీసేవాళ్ళు, చక్కగా రాసేవాళ్ళు తప్పకుండా అందంగానే ఉంటా'రని ఆమెకు గట్టినమ్మకం ఉంది.

'వికారంగా ఉండడమే కాదండి! అప్పు డప్పుడు పిచ్చికేకలు కూడా వేస్తుంటాడు. చిన్నపిల్లలు అతన్నిచూస్తే జడుసుకుంటా రంటే, నమ్మండి!'

'నిజంగా అతను పిచ్చికేకలు వేస్తాడా?' అని అడిగింది సరళ కుమారస్వామి మాట లను నమ్మలేకపోతూ.

'అయ్యో! అమ్మాయిగారూ! మీరు నా మాటలను యింకా నమ్మడం లేదన్నమాట, నేను అతన్ని చూసిన తరువాత మూడు రోజులపాటు సరిగ్గా భోజనం కూడా చేయ లేక పోయానండి!'

సరళ యేమీ మాట్లాడలేదు.

సరళ మాట్లాడకపోవడం చూసి కుమార స్వామి తనమాటలు పని చేశాయనుకొని సంతోషించాడు సరళ క్లబ్బుకు వెళ్ళకుండా చెయ్యడానికి యిదే అవకాశం అనుకున్నాడు కుమారస్వామి

'అమ్మాయిగారూ! మీరు ఆ సభకు వెళ్ళొద్దండి! ఆ సభకు మీరు వెడితే, తప్పకుండా, మీకు తలనొప్పి వస్తుంది' అన్నాడు కుమారస్వామి సరళను బతిమాలుతూ.

'అయితే యిప్పుడేం చేద్దాం?' అని ప్రశ్నించింది సరళ

ఈ ప్రశ్నకోసమే - యెదురు చూస్తున్న కుమారస్వామి వెంటనే 'యింటికి తిరిగి వెళ్ళిపోదామండి!' అన్నాడు

'సరళ తిరిగి యింటికి వెళ్ళిపోతే, తాను ఒక్కడూ వెంటనే టాక్సీలో సభకు వెళ్ళవచ్చు'నని కుమారస్వామి ఆలోచన

'ఇప్పుడుమళ్ళా యింటికి యెందుకులే, ఏదైనా సినిమాకు వెడదాం' అన్నది సరళ కారువేగం తగ్గిస్తూ.

సరళ మాటలువిని కుమారస్వామి యేమీ మాట్లాడలేక పోయాడు అతని ఆలోచనల్ని ఒక్కసారిగా తలక్రిందులయి పోయాయి. 'సరళ సినిమాకు వెడితే, తానుకూడా ఆమెతో పాటు సినిమాకువెళ్ళాలి. ఆ పరిస్థితిలో తాను సభకు వెళ్ళడానికి అసలు అవకాశమే ఉండదు. అందుచేత తాను యెవరైనదీ సరళకు తెలిసిపోవడం వలన తరువాత యే యిబ్బంది కలిగినప్పటికీ; ముందు తాను మాత్రం సభకు తప్పకుండా వెళ్ళాలి!' కుమారస్వామికి యీ ఆలోచన రాగానే అతను తన 'ప్లాను' మార్చాడు.

'అమ్మాయిగారూ! బాబుగారు చెప్పి నట్లు మనం సభకు కాకుండా, సినిమాకు వెడితే, బాబుగారు నా చెవులు మెలేసేస్తా రండి' అని కుమారస్వామి భయపడు తున్నట్లుగా తన చెవులు పట్టుకున్నాడు.

కుమారస్వామి భయంచూసి సరళ తనలో తాను నవ్వుకొంది కాని యేమీ మాట్లాడ లేదు.

'అమ్మాయిగారూ! మీతో నేను యేదో అన్నాను కాని రజనీకుమార్ మరీ అంత 'యిది'గా ఉండడులెండి!'

'మరి పిచ్చికేకలు వెయ్యడా?' అని అడిగింది సరళ.

'ఇంకా నేను చెప్పడం యెందుకు లెండి! కొంచెం సేపట్లో మీరే అతన్ని చూస్తారు కదా! మనం సభకే ముందుగా వెడదాం అక్కడ మీకు తలనొప్పివస్తే వెంటనే వచ్చేయవచ్చును' అని కుమారస్వామి ఒక రాజీమార్గాన్ని సూచించాడు.

'ఓకే' అన్నది సరళ కారు వేగం పెంచుతూ.

క్లబ్బు ఆవరణలో కారు ఆపింది సరళ కారుదిగిన తరువాత ఆమె కుమారస్వామికి ఒకరూపాయి యిచ్చి 'కాఫీతాగి యిక్కడే ఉండు' అని చెప్పింది.

'అలాగేనండి, అమ్మాయిగారూ! మీరు తొందరగా వచ్చేయండి' అన్నాడు కుమార స్వామి యెంతో భయభక్తులతో.

'ఓకే' అంటూ సరళ క్లబ్బులోనికి వెళ్ళింది.

(ఇంకా ఉంది)

# మనిషి మైనస్ మమత

త్రి. విజయలక్ష్మి



'రండిరా, రండి. కలేజా వుంటే రండి. మీరు ముగ్గురు, నేనొక్కడ్ని. ఐనా రెడీ. స్టై. నా చేతిలోదేమిటో తెలుసుగా. కొత్త బ్లేడు. జామపండును కోసినట్లు చేస్తాను. రండి' అంటూ బ్లేడును పట్టుకున్న చేతిని గాలిలోకి విసుర్తున్నాడు గోపాల్. అతనిచేయి తమకు తగలకుండా జాగ్రత్త పడుతూ అతన్ని ఎలాగైనా లొంగదీసుకోవాలని ప్రయత్నిస్తున్నారు రాజు, శీను, రమేశ్. ముగ్గురూ మూడు వైపులనుంచీ గోపాల్‌మీదికి వస్తున్నారు. వారికందకుండా వెనక్కు నడుస్తూనే బ్లేడును గాలిలోకి విసురుతూ వారి గమనాన్ని నిరోధిస్తున్నాడు గోపాల్. అతను వెనకడుగు వేయడం వారి ముగ్గురిలో ఉత్సాహాన్ని పెంచింది. సమయం చూసి అతనిమీద పడటానికి పట్టుదలగా ముందుకు వస్తున్నారు.

గోపాల్‌కు చేయినొప్పి పుడుతోంది. వారి వారినుండి ఎలా తప్పించుకోవాలో అతనికి తోచడంలేదు. అతనికున్న రామబాణమల్లా అదొక్కటే. తనమీద కలబడ్డానికి ఎవరైనా వస్తుంటే జేబులోని బ్లేడును బయటకు తీసి దానితో ప్రత్యర్ధిని చీరేస్తానంటూ గాలిలో విన్యాసాలు చేస్తాడు. ఆ బ్లేడుకు దడిసి ఎవరూ అతనితో తలపడేవారు కాదు. కాని ఈనాడు రాజు, శీను, రమేశ్ బ్లేడుకు భయపడకుండా తనమీదకు వస్తుంటే ఏం చేయాలో తోచడంలేదు గోపాల్‌కు.

మరో పదినిమిషాలు గడిస్తే గోపాల్ చేతిలోని బ్లేడు ప్రత్యర్థుల శరీరాల్ని చీరేదో లేక ఆ ముగ్గురూ గోపాల్‌మీదపడి అతడ్ని పచ్చడిచేసేవారో తెలీదుగాని, అప్పుడే వచ్చిన వాళ్ల టీచర్ విశ్వనాధంగారు కలుగజేసుకోడంతో అప్పటికా యుద్ధకాండ ఆగింది.

'ఏంవిటోయ్ ఇది? మీరు విద్యార్థులా, యుద్ధార్థులా' నవ్వుతూ ప్రశ్నించారు విశ్వనాధంగారు.

'చూడండి సార్. నా టెర్లిన్‌షర్టును ఎలా చింపాడో చూడండి. ఇంటికి వెళ్తే మావాళ్లు నన్ను చితుకపొడుస్తారండి' శీను చీరికలైన టెర్లిన్‌షర్టును చూపించాడు.

'నిజమేనా గోపాల్? ఎందుకలా చేశావ్?'

గోపాల్ మౌనంగా నిల్చున్నాడు.

ఇదివరకొకసారి క్లాసులో తనముందు కూర్చున్న విద్యార్థి చొక్కానిండా గోపాల్ సిరా చల్లిన సంఘటన గుర్తువచ్చింది విశ్వనాధంగారికి. ఆరోజూ ఇలాగే నిల్చున్నాడు గోపాల్.

'అసలు నీకా బ్లేడెందుకు చేతిలో?' విశ్వనాధంగారు మళ్లీ ప్రశ్నించారు.

'వాడిదగ్గర అది ఎప్పుడూ వుంటుందండి. దాంతోటి స్కూల్లో డెస్కును, బ్లాక్‌బోర్డును, సినిమాకు వెళ్లినప్పుడక్కడి సీట్లను కోస్తుంటాడండి' రాజు అన్నాడు.

విశ్వనాధంగారు ఆశ్చర్యపోయారు. నిండా పన్నెండేళ్లు లేని ఈ గోపాల్ ఇన్ని విధ్వంసక చర్యలు చేస్తున్నాడేమిటా అనిపించింది.

'తప్పు గోపాల్. అలా చేయవచ్చునా. ఏ వస్తువునైనా నాశనం చేయడం చాలా తేలిక. కాని బాగుచేయడమంటే ఎంత శ్రమపడాలో, ఎంత వ్యయమౌతుందో ఆలోచించు. శీనూ, మీ నాన్నగారికి నేనెలాగో నచ్చచెప్పి నీకు మాట రాకుండా చూస్తాను. నీవుమాత్రం గోపాల్ ఈపని చేశాడని ఇంట్లో చెప్పకు. వెళ్లు. రాజూ! రమేశ్!

మీరుకూడా వెళ్ళండి.'

వాళ్ళటు వెళ్ళగానే తవలోతను అనుకున్నట్లుగా అన్నాడు గోపాల్. 'ప్రతిరోజూ తనే టెర్లిన్‌షర్టు వేసుకొస్తున్నానని మహా నీల్గుతున్నాడు. తిక్క కుదిరింది '

ఆ మాటల్ని విశ్వనాథంగారు విన్నా విననట్లే ఊరుకున్నారు

'మీ ఇల్లెక్కడ గోపాల్?'

'ప్రక్కవీధిలో మొదటిల్లే సార్.'

'అలాగా, పద నేనూ అటే వస్తున్నాను '

*  *  *

ఆ మర్నాడు—

సరిగా అదే సమయం, సాయంత్రం ఆరు గంటల సమయం—

రోడ్డుమీద నడుస్తున్న విశ్వనాథంగారు గోపాల్ ఇంటివైపు చూశారు. అక్కడి దృశ్యం ఆయన్ను చకితుడ్ని చేసింది. ప్రహరీగోడకు బదులుగా నిల్చిన వెదురు కర్రల తడికసందులనుంచి కన్పించాడు లోపల వరండాలో నిల్చున్న గోపాల్ అతని శరీరంపై వెదురుబెత్తం నాట్యం చేస్తోంది. ఆ దెబ్బలకు అతను ఏడవటంలేదు. పైగా కోపంగా, నిర్లక్ష్యంగా చూస్తున్నాడు. ఎదురు తిరగాలని ప్రయత్నం చేస్తున్నాడు. స్త్రీది జాలిగుండె అని, మెత్తని మనసని భావించే విశ్వనాథంగారు గోపాల్‌ను కొడుతున్న ఆ స్త్రీనిచూసి విస్తుపోయారు.

'ఏమండి, ప్లీజ్, ఆగండి. ఎందుకలా కొడ్తారతన్ని?'

'ఎవరు మీరు? ఎందుకొచ్చారిక్కడకు? మీదారిన మీరు వెళ్ళలేరూ?'

'వెళ్ళలేక కాదమ్మా. కావాలనే వచ్చాను. గోపాల్ నా స్టూడెంటు. అతను అనుభవిస్తున్న శిక్ష ఏ నేరానికో తెలుసుకో వచ్చా?'

'వాడకి టీచరు కదా మీరు, తప్పకుండా తెలుసుకోవాలి. స్కూలునుంచి వచ్చేవాడు బుద్ధిగా ఇంట్లోకి రావచ్చునా? ఆహాఁ అలా రాకుండా గుమ్మందగ్గర నిలబెట్టిన స్కూటర్ టైరును సూదితో పొడిచి లోపలికొచ్చాడు. గాలిపోయిన స్కూటరును నడిపించుకపోవడం ఎంతకష్టం? ఇంటికొచ్చిన పెద్దమనిషికి ఇదేనా చేసే మర్యాద?'

విశ్వనాథంగారు క్షణంసేపు ఆలోచించారు నిన్న గోపాల్ శీను టెర్లిన్‌షర్టును ఎందుకు చీలికలు చేశాడో అర్థమైంది — తనకు టెర్లిన్‌చొక్కాలు లేవని, తోటివాడు రోజూ ఆ టెర్లిన్‌చొక్కాలు తొడిగి గొప్పలుపోతున్నాడని. మరి ఈనాడు గోపాల్ స్కూటరు టైరుకు బెజ్జం పొడిచిందెందుకు? తనకు స్కూటర్ లేదనా? కారణం సబబుగా తోచలేదు ఆయనకు. మరో కారణమేదో ఉండివుండాలి అనిపించింది.

'లెటిట్‌గో సరూ. డోన్ట్‌మేక్ మచ్ ఫస్ ఆఫిట్,'

ఆ మాటలనిన వ్యక్తిని చూశారు విశ్వనాథంగారు. ఆ వ్యక్తే స్కూటర్ సొంతదారయి వుంటాడని గుర్తించారు. పాతికేళ్ల అతను ఎర్రగా, అందంగా సూట్ వేసుకుని వున్నాడు.

విశ్వనాథంగారు 'సరూ'ని చూశారు. ఎర్రగా కందిన మొహంతో ముక్కుపుటా లెగిరిపడేటట్లు శ్వాసను వేగంగా పీలుస్తోంది. అపరకాళిలా వుందామె. ఆమె మెడలో ఒంటిపేట బంగారం గొలుసు మాత్రం వుంది

'వీరు మీ...'

అర్థోక్తిలో ఆగిపోయిన విశ్వనాథంగారి వేపు కొరకొరా చూస్తూ 'ఫ్రెండ్' అన్నదామె.

'మీకు అభ్యంతరం లేకపోతే గోపాల్‌ను నాదగ్గరకు ట్యూషనుకు పంపండి కొన్నాళ్లు' అన్నారు విశ్వనాథంగారు.

'వాడ్ని బాగుచేద్దామనుకుంటున్నారేవిటి? అలాంటి ఆశ పెట్టుకోకండి. పైగా వాడి శని మీకూ పట్టుకుంటుంది '

'శనేమిటి?'

'వాడుత్త నష్టజాతకుడు మేష్టారూ! పుట్టకుండానే తండ్రిని చంపేడు, పుట్టి తల్లిని మింగేడు. చదువు వంటబట్టించుకోకుండా నా జీవితానికి గుదిబండలా తయారయ్యాడు' గోపాల్ వీపుపై మళ్లీ ఒహటి తగిలించిందామె

'నాకా నమ్మకాలేమీ లేవు లెండి...'

*  *  *

అప్పుడే స్కూలు ఆవరణదాటి బయటికొచ్చారు విశ్వనాథంగారు. స్కూలుబయట పెద్దపెద్ద చెట్లున్నై. ఒక చెట్టుక్రింద ఒంటరిగా కూర్చుని ఉన్నాడు గోపాల్!

'ఈరోజు ఎవరితోనూ తగవుపెట్టుకోకుండా ఒంటరిగా కూర్చున్నాడేమిటి చెప్మా' అని ఆశ్చర్యపోయారు విశ్వనాథంగారు.

గోపాల్ చెట్టుక్రింద కూర్చుని చేస్తున్నదేమిటో చూడాలనిపించి మెల్లగా చెట్టుక్రిందకు నడిచారు విశ్వనాథంగారు. గోపాల్ బ్లేడుతో చెట్టుమొదట గంటుపెడుతున్నాడు. ఆ గంటు చాలా పెద్దదిగా వుంది ఒక్కసారిగా పెట్టినది కాదది. బహుశః అతను తీరిక దొరికినప్పుడల్లా ఆ గంటును కొద్దికొద్దిగా పెద్దది చేస్తూ ఉండివుంటాడనిపించిందాయనకు.

'ఏం గోపాల్! ఒంటరిగా కూర్చున్నావ్?'

విశ్వనాథంగారి పిలుపుకు ఉలిక్కిపడి బ్లేడును జేబులో వేసుకున్నాడు 'అబ్బే .. లేదండి. ఊరికనే కూర్చున్నాను' తను పెడుతున్నగంటు విశ్వనాథంగారికి కన్పించకుండా దానిమీద కూర్చున్నాడు గోపాల్.

'గోపాల్ పెద్దవాడైనా అతనికి ఈ బ్లేడును ఉపయోగించే అలవాటు పోదేమో. కొంపదీసి మనిషి గొంతుకల్ని కోసేయుడు గదా' ఆ ఆలోచన రాగానే విశ్వనాథంగారు భయపడిపోయాడు

'పొద్దుగూక వస్తోంది, ఇంటికిపోదాం రా గోపాల్!'

గోపాల్ ఇబ్బందిగా మొహం పెట్టేడు. కొంచెంసేపు తటపటాయించి, 'ఇవాళ మా అక్క ఇంటికొచ్చేసరికి ఆలస్యమౌతుంది. కాసేపు ఇక్కడే కూర్చుని వస్తానండి' అన్నాడు. విశ్వనాథంగారు 'సరే' నంటూ నడక సాగించారు.

గోపాల్ ఇంటివద్దకు రాగానే అలవాటుగా లోపలికి చూశారు విశ్వనాథంగారు. వరండాలో 'సరూ' కూర్చుని వుంది. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లుగా వున్నదామె వైఖరి 'తన ఫ్రెండ్‌కోసమేమో' ననుకుంటూ నడుస్తున్నారు విశ్వనాథంగారు.

'మేష్టారూ! మేష్టారూ! వన్‌మినిట్. మీ శిష్యుడింకా రాలేదేమండి' ఆమె వీధి వాకిలివరకూ వచ్చి అడిగింది.

'స్కూలుదగ్గర కూర్చోనున్నాడు. మీరివాళ ఆలస్యంగా ఇంటికొస్తారని చెప్పాడే.'

'ఓరి దొంగరాస్కెల్. రానీండి వాడి ప్రాణం తీసేస్తానివాళ.'

'మళ్లీ ఏం జరిగిందండి.'

'ఇలా'రాండి, మీకే తెలుస్తుంది' అంటూ లోపలికి నడిచిందామె. విశ్వనాధంగారు తప్పనిసరిగా ఆమె ననుసరించారు.

వరండాలోని కొయ్యకుర్చీ చూపి కూర్చో మని లోపలికి వెళ్లింది 'సరూ.'

విశ్వనాధంగారు కూర్చున్నారు. కుర్చీ చేతులమీద గరుకుగా తగిలితే అటు చూశారాయన. బ్లేడు గంట్లు !

'ఇదిగో చూడండి' ఆమె లోపల్నుంచి వచ్చింది. ఆమె చేతిలో రావుసైజు దళసరి కాగితం వుంది. ఆ కాగితంనిండా సిరా వొలికి వుంది.

'మోడరన్ ఆర్ట్ వేశారేంటి' నవ్వుతూ అన్నారాయన

ఆమె కూడా నవ్వింది. 'ఇది మీ శిష్యుడు చేసినపని. ఈ సిరా వెనకాల నేను నెల రోజులుగా కష్టపడి చిత్రించిన చిత్ర ముంది. నెలరోజులు ... సోమెనీ లాంగ్ అవర్స్ ..ఈ చిత్రాన్ని పోటీకీకూడా పంపుదా మనుకున్నాను. దాని మొహాన శిరాపోసి ఇలా చేశాడు. విధ్వంసక ప్రవృత్తికి మారు పేరండి వీడు' తన ఆవేదనను వెళ్ల గక్కిందామె.

'ఇదన్నమాట వాడు వెంటనే ఇంటికి రాకుండావున్న కారణం. పాపం, భయపడి వుంటాడు తనుచేసిన నేరానికి లభించ పోయే శిక్షను తలచుకొని. ఈసారికి వాడి నేమీ కొట్టకండి. మీరు మరోలా అనుకోక పోతే నాదొక సలహా. పిల్లలు తప్పలు చేయ డానికి కారణమేదో గ్రహించి వాళ్లా తప్పులు చేయకుండా చూడాలిగాని, కేవలం దండనద్వారానే వాళ్లలో మార్పు తేవాలను కోడం సరియైన పద్ధతి కాదేమో.'

ఆ మాటలని వెంటనే వచ్చేశారు విశ్వ నాధంగారు.

'గోపాల్ వింత ప్రవర్తనకు గట్టి కారణమేదో వుండివుండాలి. అది ఏమై వుంటుంది ?' అవి యోచిస్తూ నడక సాగించారు.

* * *

'పోతన్నా ..కపోతన్నా... అలా ముడుచుక పోయావేమోయ్! లే...మా బాబువు కదూ. నీకే .. మరేమో... శనగపప్పు కొనిపెట్ట మంటావా, బందరులడ్డు కొనిపెట్ట మంటావా? చెప్పరా పిచ్చినాన్నా. వీళ్లంతా

# మనిషి మైనస్ మమత

వింటారని భయమా. సరేలే నా చెవులో చెప్పు...' చింపిరితల, మాసినబట్టలు పిచ్చివాలకంతోవున్న అతను పావురాయిని చేతుల్లోకి తీసుకుని ప్రేమగా, లాలనగా దాని రెక్కల్ని దువ్వటం మొదలెట్టాడు. అతను చూపుతున్న ఆప్యాయతకు పరవశించి పోతున్నదా అన్నట్లుగా ఆ పావురం అర మోడ్పుకన్నులతో 'గూ...గూ' మని తమాషాగా శబ్దం చేస్తోంది.

గోపాల్ చూపంతా ఆ పావురం మీదనే వున్నై. దాని పారవశ్యంలో తనూ తల మునకలవుతున్నాడు.

'ఒరే పోతన్నా నాకోముద్దు పెట్టరా.' అతనలా అడగటమే తడవుగా పావురం ఆ పిచ్చివాని భుజంమీదకు ఎగిరి అతని పెదాలకు తన తలను తాకించింది. అతను దాన్ని మళ్లీ చేతుల్లోకి తీసుకుని ముద్దు లతో ముంచేశాడు.

'ఎందుకు దాన్నలా ముద్దుపెట్టుకుం టావ్?' ఎవరో కుర్రాడు అడిగాడా పిచ్చి వాడ్ని.

'నీకేం నా కొడుకుని నేను ముద్దు పెట్టుకుంటే? నిన్ను మీ అమ్మా నాన్నా ముద్దుపెట్టుకోరూ'' పిచ్చివాడు కళ్లు పెద్దవిచేస్తూ అన్నాడు.

గోపాల్ మొహంలో రంగులు మారినై. పిచ్చివాని మాటలు అతని ఆనందాన్ని భగ్నంచేసినై. అతను దోషిలా మెల్లగా అక్కడ్నించి కదిలాడు.

'పోతన్నా, మనం ఇక్కడుండొద్దు. నీ మీద నే చూపుతున్న ప్రేమను వీళ్ల చూళ్లేకుండా వున్నారు పోదాం పద' పిచ్చి వాడు కూడా పావురంతో ఆచోటు వదిలాడు.

'ఎవరో పాపం. పుత్రశోకంతో పిచ్చివా డైనట్లుంది, ప్చ్'... అరే! గోపాల్ ఏడీ? వీడికోసమే నేనిందాకటినుంచి నిల్చుంటే ... వీడూ మార్కెట్‌లోకే వెళ్తున్నాడే. ఆగరా నేనూ వస్తున్నాను' విశ్వనాధంగారు కూరల మార్కెట్‌వైపు నడిచారు.

* *

'గోపాల్! గోపాల్!!'

గోపాల్ పలుకలేదు. అతను ఎటో చూస్తున్నాడు దీక్షగా. గుమ్మం అవతల విశ్వనాధంగారి భార్య రాధమ్మ కూర్చొని వుంది. ఆమె తన వొడిలోని చిన్న పాపా యిని ఆడిస్తూ,

'చిరునవ్వు నవ్వే చిట్టిపాపాయి
బోసి నవ్వులే మా యింటి సిరులు'

అని పాడుతోంది. ఆపాట ఏమిటో తన కర్థమైనట్లు ఆ పాప నవ్వుతోంది. ఆ బోసినవ్వుల సిరులకు మురిసిపోయి పరవ శిస్తోందామె. ప్రక్కనే కూర్చున్న బాబు కూడా నవ్వుతున్నాడు. బాబుకి ఏదో అను మానమొచ్చి తల్లి నడిగాడు: 'అమ్మా చెల్లాయి పెద్దదైతే నీలాగా వుంటుందా నాన్నలాగా వుంటుందా?'

'నీకెలావుంటే ఇష్టం?'

'నీలాగే వుండాలమ్మా'

'మా నాయనే. నా వరాలతండ్రీ...' ఆమె బాబునికూడా ముద్దులతో ముంచివేసింది...

గోపాల్ చూస్తున్న ఆ దృశ్యాన్ని విశ్వ నాధంగారుకూడా చూశారు. గోపాల్ తన్మ యత్వమెందుకో గ్రహించారు. ఆయనకు నిన్న ప్రొద్దుటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. గోపాల్ నిన్న పిచ్చివాడు పావు రాన్ని ఆప్యాయంగా దువ్వి ముద్దుపెట్టు కుంటుంటే ఎలా చూశాడో ఇప్పుడూ అలాగే చూస్తున్నాడు. తల్లి తన బిడ్డలపై వర్షించే ప్రేమామృతాన్ని ఆ దృశ్యంలో గోపాల్ చూస్తున్నాడని అర్థం చేసుకున్నారు విశ్వనాధంగారు.

'గోపాల్'

'ఏంటి మేష్టారూ?' గోపాల్ తన దృష్టిని మరల్చుకున్నాడు.

'నిన్నొక విషయం అడగనా?'

'అడగండి మేష్టారూ!'

'ఆరోజు మీ యింటికి స్కూటరుమీద వచ్చిందెవరు?'

'ఆరోజే కాదండి. రోజూ వస్తాడు.'

'అలాగా. ఎవరతను?'

'అమాటే నేను మా అక్కను అడిగా నండి.'

'ఏం చెప్పిందేం' కుతూహలంగా ప్రశ్నిం చారు విశ్వనాధంగారు.

'నీకెందుకు, నీపని నువ్వు చూసుకోమని కసిరిందండి.'

విశ్వనాధంగారు వెంటనే మాట్లాడలేదు. ఆయనలో ఆలోచనా తరంగాలు లేచినై ...

ఒక్కగా నొక్క తమ్ముడిమీద ఆ అక్క కెందుకో అంత కసి! వ్యక్తత తెలిసిన పెద్దలే

పిన్నల మనసుల్ని నొప్పించి వారి భవిష్యత్తును పాడుచేస్తున్నారు. గోపాల్ పుట్టడమే తల్లిదండ్రుల మరణానికి హేతువని చదువుకుని ఉద్యోగంచేస్తున్న 'సరూ' నమ్మడమేమిటి? 'అమ్మను చంపింది నువ్వే. నాన్నని చంపింది నువ్వే' అని పదే పదే గోపాల్‌ను దూషిస్తే అమ్మా, నాన్న బ్రతికొస్తారా? ఎదగని పసిమనసు అకారణమైన ఆ దూషణకు తట్టుకోగలదా? పసిహృదయానికి కావలసిన మమత, వాత్సల్యం, లాలన కరువవడమే కాకుండా ఇలాంటి అకారణ దూషణల ఎదుర్కోవలసి వచ్చినపుడు, ఆ హృదయములో కసి, కర్కశత్వం పేరుకోడంలో ఆశ్చర్యమేం వుంది. ఆ కసి, కర్కశత్వం మాత్రమే గోపాల్‌చేత అలాంటి విధ్వంసక చర్యల్ని చేయిస్తున్నాయి.

'అయితే ఆరోజు అతని స్కూటరుకు గాలి తీసింది నీవేకదూ?'

విశ్వనాధంగారి ప్రశ్నకు గోపాల్ వెంటనే జవాబు చెప్పలేదు. తలవంచుకుని మౌనంగా కూర్చున్నాడు రెండుక్షణాలసేపు. ఆతర్వాత తల యెత్తాడు అతనికళ్లు తడిసి వున్నాయి.

'నిన్ను నేనే మనసు. నిజం చెప్పు' అనునయించారాయన.

'నేనే తీశాను సార్! ఆతను మా యింటికి రావడం నా కిష్టంలేదండి. అక్కకు నేనంటే ఇష్టం లేనప్పుడు అతనంటే నాకెందుకుండాలి గౌరవం? నేను తన జీవితానికి గుదిబండలా తయారయ్యానని అన్నది కదా మీ ఎదుటే!'

విశ్వనాధంగారు తల వంచుకున్నారు. 'సరూ! నీవు చేస్తున్న పని తప్పు. నీ 'ఫ్రెండ్'ను నీవు భర్తగా ఎన్నుకుని ఉండవచ్చు. నేడో రేపో వివాహం చేసుకోవాలనుకుంటుండవచ్చు. కాని నీ తమ్ముని, ఒక పసిహృదయాన్ని, మాతృప్రేమకు పితృప్రేమకు మరే ప్రేమకు నోచుకోని అభాగ్యుని నీదారికి అడ్డంగా ఊహించుకోడం ఆ విషయం అతనికి తెలిసేలా నీవు ప్రవర్తించడం క్షమించరానిది. తల్లిదండ్రుల తర్వాత వారి బాధ్యతను వహించవలసిన నీవే ఇలా ప్రవర్తిస్తుంటే, రేపు నిన్ను పెళ్లాడిన భర్త నీ తమ్ముని ఉనికిని మాత్రం సహించగలడా? తప్పుచేస్తున్నది నీవు. శిక్ష అనుభవిస్తున్నదీ, అనుభవించేదీ నీ తమ్ముడు' విశ్వనాధంగారి మనసు ఆర్ద్రమైంది.

'తప్పు, గోపాల్! మీ అక్కకు నీవంటే ఇష్టం లేకపోవడమేమిటి. మీ అక్కకు నీవంటే ఎక్కువ ఇష్టం కనుకనే నీ వెప్పుడూ బాగా చదువుకోవాలనీ, తప్పు పనులు చేయకుండా వుండాలని చెప్తుంటుంది. నీ శ్రేయస్సును కోరేవాళ్లేగదా, నిన్ను మంచిమార్గంలో పెట్టాలని ప్రయత్నించేది!'

తను చెప్పింది నిజం కాదని తెలుసు విశ్వనాధంగారికి. కాని, తప్పదు. అబద్ధమాడాలి. కృంగిపోతున్న అతనిలో రవ్వంత ఆశను రగిలించాలి. అతనిలోని నిస్పృహను పారద్రోలాలి. అతని మనసుకు ఊరట కలిగించాలి!

విశ్వనాధంగారికిప్పుడు తృప్తిగా వుంది. తనకిప్పుడు గోపాల్ అర్ధమైనాడు. అర్ధమైనాడు కాబట్టి అతనిలో మార్పు తీసుకవచ్చి అతడ్ని మనిషిగా తీర్చిదిద్దటం ఇహ తేలికే. తన ఈ ప్రయత్నానికి 'సరూ'కూడా చేయూతనిస్తే తనకెక్కువ శ్రమ ఉండదు. 'రేపు 'సరూ'ని కలుసుకుని గోపాల్ ప్రవర్తనకు కారణం నీవేనని చెప్పి, తన తప్పిదాన్ని దిద్దుకోమని చెప్పాలనుకున్నారు. గోపాల్‌పట్ల ఆమె ప్రవర్తన మారనిది అతనిలో మార్పు రాదు. అవును, దీపం వెలగాలంటే నూనే పోయాలి, నీరుకాదు. ●

గుండు చెప్పిన కథ - **కథ అడ్డం తిరిగింది** - బుజ్జాయి

9











(ఇంకావుంది)



'తాతా-మనవడు'లో విజయనిర్మల, రాజబాబు

# సినిమా

## ప్రేమపక్షులు

'షూటింగు పూర్తయింది' అన్నారు, దర్శకుడు చిన్నపరెడ్డి ఈ చిత్రాన్ని మార్చిలో విడుదల చెయ్యాలి, అన్నారు నిర్మాత చిన్నపరెడ్డి.

'లాయర్ వేషం కట్టడం నాకు తొలి అనుభవం' అంది 'ప్రేమపక్షులు' డిఫెన్సు లాయరు పాత్రధారిణి కృష్ణకుమారి. పబ్లిక్ ప్రాసిక్యూటరుగా కృష్ణంరాజు నటించారు. వీరిద్దరూ ఆలు, మగలుగా కనిపిస్తారు కోర్టులోనే గాక యింట్లోకూడా వాదించుకోడం వీరికి అలవాటు . ఈ రెండూ హాస్యరసాన్ని అందిస్తాయి.

*జడ్జిగా రేలంగి !*

హాస్యబ్రహ్మ రేలంగి 'ప్రేమపక్షులు' చిత్రంలో జడ్జి పాత్రను పోషించారు హాస్యం అంటే ఏమిటి? ఎలా వుండాలి? తెలియచెప్పారు, వున్నకొద్ది అవకాశంలో రేలంగి ఈ చిత్రంలో డిటెక్టివ్‌గా చంద్రమోహన్, నర్తకిగా జయకుమారి నటించారు

*భలే జంట !*

ప్రేమజంటగా ప్రకాష్, చంద్రకళ చిలకా గోరింకలవలె వున్నారు కొత్తవాడయినా, గడుసుగానే నటించాడు శృంగార ఘట్టాల్లో .విజయలలిత వయ్యారం వొలకబోసింది

'ప్రేమపక్షులు' కథను ఉషశ్రీ వ్రాయ, మాటలను మోదుకూరి జాన్సన్ రచించారు. అనిల్‌ప్రభాస్ విడుదల

## ఉషశ్రీలో పద్మశ్రీ!

ఉషశ్రీ ఫిలింస్ నిర్మించబోయే కొత్త చిత్రంలో పద్మశ్రీ నటించడానికి అంగీకరించారు ఆ పద్మశ్రీ ఎవరో తెలుసా? నటరత్న నందమూరి తారకరామారావే ఆయనతోబాటు కొత్తహీరో ప్రకాష్‌కూడా ఒక ముఖ్యపాత్రను పోషించగలడని, దర్శకత్వం నెరపనున్న చిన్నపరెడ్డి చెప్పారు ఈ చిత్రం తారకరామాద్వారా విడుదలవుతుంది అని కూడా చెప్పారు

## సెహభాష్, చంద్రకళ!

అన్నమాటను గత నాల్గయిదురోజుల్లో కనీసం వందమంది అయినా చెప్పి వుంటారు ఈ ప్రశంసకు పాత్రురాలైంది ఎలాగ? అని మీకు తెలియాలిగా

శ్రీ పూర్ణామూవీస్ నిర్మించిన 'స్త్రీ' చిత్రం ఆర్ ఆర్ కాపీని ప్రముఖులు చూడటం తటస్థించింది వీక్షించిన వాళ్లందరూ ముక్తకంఠంతో సెహభాష్, చంద్రకళ అన్నారు మరికొందరు ఈ సారి ఊర్వశి బిరుదు ఈమెకే, అన్నారు ఇదంతా ప్రత్యగాత్మకు చెందాలి, అన్నారు మరికొందరు

'స్త్రీ'లో తల్లిగా, కూతురుగా చంద్రకళ ద్విపాత్రాభినయం చేసింది కథానాయకుడి పాత్రను కృష్ణంరాజు, దుష్టనాయకుడి వేషాన్ని చంద్రమోహన్ ధరించారు ఈ చిత్రానికి రావి శాస్త్రి మాటలను, మహదేవన్ సంగీతాన్ని సమకూర్చారు ఇటీవల యింత మంచిచిత్రం రాలేదు అని ఘంటాపదంగా చెప్పగలను కథను ప్రత్యగాత్మ



'దేశోద్ధారకులు'లో రామారావు, శుభ.



మిస్ యునైటెడ్ స్టేట్స్‌గా ప్రపంచసుందరి పోటీలో పాల్గొన్న **21** సంవత్సరాల లిండాకార్టర్ అందగత్తె మాత్రమే కాదు, మంచి గాయనికూడా. ప్రస్తుతం బ్రిటన్‌లో గాయనిగాఉంటూ టెలివిజన్ చిత్రాల్లో నటిస్తూంది

వ్రాశారు. శ్రీ ఫిలింస్ విడుదలచేసే ఈ చిత్రాన్ని ఏ. పూర్ణచంద్రరావు, ఎమ్. చంద్రశేఖర్ నిర్మించారు.

## మానవుడు—దానవుడు (తమిళం) ప్రారంభం!

తెలుగునాట, తెలుగు ప్రజలనోట జగపతి సంస్థ అంటే ఒక ప్రత్యేక గౌరవం వుంది. కారణం— జగపతి అధినేత అందించిన చిత్రాలన్నీ ప్రజల మెప్పును పొంది యుండడమే

ఇప్పుడాయన తమిళ మార్కెట్టులో అడుగుపెట్టారు. తెలుగులో బహుళ ప్రజాదరణ పొంది, విశేష ధనార్జనచేసిన 'మానవుడు—దానవుడు' కథను తమిళంలో వర్ణ చిత్రంగా నిర్మిస్తున్నారు

వేణు (మానవుడు) జగన్ (దానవుడు) పాత్రలను శివాజీ గణేశన్ పోషిస్తున్నారు కృష్ణకుమారి వేషాన్ని షావుకారుజానకి, శారద భూమికను మంజుల ధరిస్తున్నారు నాగేష్ రాజబాబుగా, కనిపిస్తారు. ముఖ్య పాత్రలను సుందరరాజన్, మనోహర్, రామదాసు, జయకుమారి పోషిస్తారు ఈ చిత్రానికి వెంకటరత్నం ఛాయను, మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

జనవరి '11న ఉదయం గం 10–07 నిలకు విజయాగార్డెన్‌లో పాటల రికార్డింగు ప్రారంభమైంది

# సినిమా

## మమత

కృష్ణకిశోర్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'మమత'చిత్రం పదిరీళ్లు అయింది అని నిర్మాత జోతీ శేఖర్‌బాబుద్వారా తెలుసుకున్నాను. ఫిబ్రవరికల్లా షూటింగు పూర్తిచేసి, మార్చికి విడుదల చెయ్యదలచినట్టు, డిస్ట్రిబ్యూటరు శేఖర్‌బాబు చెప్పారు

'మమత' కథను నిర్మాత వ్రాశారు. మాటలను పినిశెట్టి రచించారు. మహదేవన్ సారథ్యంలో తయారైన మూడు పాటలు చిత్రీకరించబడ్డాయి. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

*కృష్ణ – జమున!*

ఈ చిత్రంలో జమున, కృష్ణ నాయకీ, నాయకులుగా నటిస్తున్నారు ముఖ్యపాత్రలను కృష్ణంరాజు, చంద్రమోహన్, సత్యనారాయణ, మిక్కిలినేని, నాగయ్య, సాక్షి రంగారావు, సూర్యకాంతం, హేమలత, రాధాకుమారి, రమాప్రభ, శ్రీదేవి పోషిస్తున్నారు.

రెండవ కథానాయిక పాత్రను కొత్త అమ్మాయిని పెట్టదలచినట్టు, నిర్మాత చెప్పారు ఈ చిత్రానికి జి. కె రాము ఛాయను నిర్వహిస్తున్నారు. జోతీ విడుదల.

నిర్మాణం ప్రారంభమైన నలభైరోజులకల్లా, పదిరీళ్లు సినిమా తీయడం ఈ రోజుల్లో ఎంత కష్టమైనపని? దాన్ని సాధించారు, జోతీ శేఖర్‌బాబు.

*షావుకారుగారి అల్లుడు !*

మార్చిలో 'మమత'ను విడుదలచేసి, ఏప్రిల్‌లో మరొక చిత్రాన్ని ప్రారంభిస్తారట, జోతీ నారాయణరావుగారి అబ్బాయి. ఈ చిత్ర కథనుకూడా ఆయనే రచించారు. పేరుకూడా పెట్టారు. 'షావుకారుగారి అల్లుడు' అని. దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డికి అప్పగిస్తారు కృష్ణ, జమున తప్పనిసరిగా వుంటారు.

## 'స్నేహబంధం'లో జమున!

శ్రీవాణీ కంబైన్స్ నిర్మించే చిత్రం యిది అన్నపూర్ణా పంపిణీ చేసే చిత్రం యిది జమున కథానాయికగా నటిస్తున్న చిత్రం యిది. ఇందులో కూడా ఆమె ప్రక్కన నాయకుడిగా కృష్ణ నటిస్తున్నారు ఈ చిత్రాన్ని ఎన్ వి సుబ్బరాజు నిర్మిస్తున్నారు

కథను నిర్మాత వ్రాశారు సంభాషణలను దాసరి నారాయణరావు వ్రాస్తున్నారు. షూటింగు ఫిబ్రవరిలో ప్రారంభమవుతుంది. అన్నిపాటలు ఆచార్య ఆత్రేయచేత వ్రాయించాలన్న ఆశ నిర్మాతకు వుంది అదే మంచిదన్న భావం దర్శకుడు చంద్రశేఖరరెడ్డికి వుంది సత్యం సంగీతసారథి ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, సత్యనారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, రమాప్రభ, లీలారాణి పోషిస్తారు

'స్నేహంకోసం ఎలాంటి త్యాగం అయినా చెయ్యగల ముగ్గురు మిత్రులకు సంబంధించిన కథ యిది' అన్నారు కథకుడు సుబ్బరాజు.

## నీడలేని ఆడది

నవశక్తి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మించిన చిత్రానికి 'నీడలేని ఆడది' అన్న పేరును స్థిరపరచినట్టు, నిర్మాత గంగాధరరావు చెప్పారు

'ఈ చిత్రంలో నటించినవారందరూ సినిమా అనుభవం లేనివాళ్లు నాటకాల్లో అనుభవజ్ఞులు,' అన్నారు నిర్మాత ఈ చిత్రానికి విద్వాన్ కణ్వశ్రీ రచన్ను, సత్యం



'ప్రేమపక్షులు'లో ప్రకాష్, జయకుమారి, విజయలలిత.

# జీవితం ఎంత ప్రియతమం, ఎంత సుకుమారం.

# క్లిక్ చేసి కలకాలం ఉంచగలరు

నమ్మకంగా పనిచేసే క్లిక్ III ఎప్పుడూ దగ్గర ఉంచండి జీవితంలో ఏమూల మైన అంతరించి పోయే మధురక్షణాలను కలకాలం, మీరు గుర్తుంచుకునేట్లు సరిగా వాటిన్ని నిలుపుకోండి

ఆగ్ఫా క్లిక్ గురిపెట్టి నొక్కు కెమెరా, ఆచరణ యోగ్యం యదార్థత వాడకం తేలిక మరియు పొదుపుగా పనిచేయుటకు తగినది

- 12 పెద్ద (6 x 6 సెం మీ ) ఫొటోలు ప్రతి 120 ఫిల్మ్ రోల్ పైనా వస్తాయి
- ఒక ప్రత్యేకమైన ఎవర్-రడీ లెదర్ పెట్టె పోర్ట్రెయిట్ లెన్స్ మరియు ఫ్లాష్‌గన్ అదనపు ధరలో లభిస్తాయి

సుస్పష్టమైన ప్రింట్లు మరియు ఎన్‌లార్జిమెంటుల కోసం ఆగ్ఫా-గెవార్ట్ ఫొటో పేపరునే కావాలని అడగండి

ఆగ్ఫా-గెవార్ట్ అధీకృత విక్రయదారులు అందరివద్ద దొరుకుతాయి
ఆగ్ఫా-గెవార్ట్, ఎ జి , లివెర్కుసెన్ వారి సహకారంతో,
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి ,చే తయారుచేయబడినది

దర
రూ 56.25
(ఎక్సైజు సుంకంతో సహా
మిగతా పన్నులు అధనం)

SIMOES-AG-11-TEL






సోల్ డిస్ట్రిబ్యూటర్లు
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి • క్రొత్త ఢిల్లీ • కలకత్తా • మద్రాసు
® ఫొటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన ఆగ్ఫా-గెవార్ట్, అంట్‌వెర్ప్/లివెర్కుసెన్ యొక్క రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్




ఆగ్ఫా క్లిక్—భారతదేశపు
అత్యంత జనాదరణగల కెమెరా

# సినిమా

సంగీతాన్ని సమకూర్చారు. ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రాహకుడు. బి. వి. ప్రసాద్ దర్శకత్వం నెరపిన ఈ చిత్రం జోతీద్వారా విడుదలవుతుంది.

ఫోటోలను పరికిస్తే, యిదొక ఫక్తు కుటుంబ పక్షంగా నిర్మితమైన చిత్రమని తెలుస్తుంది కదూ! ఆడదానికి నీడలేదా? దొరకదా? దీన్నిబట్టి యిదొక న్యూవేవ్ చిత్రం అన్న భావం కలిగిస్తుంది కదూ! ఏది ఎలా వున్నా, గంగాధరరావు ధైర్యాన్ని మనం మెచ్చుకోవాలి. ఎందుకని మీరు అడగొచ్చు.

పేరుమోసిన తారలు వుంటేనే, ప్రజలు సినిమాలను చూస్తారు, ఆదరిస్తారు అన్న గుడ్డినమ్మకం చాలామందికివున్న ఈ తరుణంలో కథలో గట్టిదనం వుంటే, నటీనటులు ఎవరైనా ఒక్కటే అన్న తలంపును గొని 'నీడలేని ఆడది' చిత్రాన్ని రూపొందించారు. ఈ చిత్రానికి స్టుడియోలను కూడా వాడకపోవడం మరొక విశేషం.

ఈ చిత్రానికి ప్రజాదరణ లభిస్తే, పరిశ్రమలో సంచలనం యేర్పడుతుంది. నిర్మాణ వ్యయం తగ్గుతుంది.



'నిండుకుటుంబం'లో జమున.

## భానుమతి చిత్రం 12 రీళ్లు పూర్తి

భరణి పిక్చర్సు పతాకం క్రింద భానుమతి దర్శకత్వం నెరపుతూ, నిర్మిస్తున్న 20 వ చిత్రం దాదాపు 12 రీళ్లు పూర్తయింది. భరణి స్టుడియోలో డిశంబరు 15 నుండి 20 వరకు, ఒక మధ్యతరగతి కుటుంబీకుని ఇంటి సెట్‌లో పద్మశ్రీ భానుమతి, గుమ్మడి, చంద్రమోహన్, నూతనతార ప్రమీల, మాష్టర్ శ్రీధర్, బేబి సరళ, ఇందిరాచార్య మున్నగువారిపై కొన్ని సన్నివేశాలను హృద్యంగా చిత్రీకరించింది దర్శకురాలు భానుమతీరామకృష్ణ.

### భానుమతి అమరగానం

'శాంతమూలేదు సౌఖ్యములేదు సారసదళ నయన' అన్న సంగీతసాహిత్య పరమైన త్యాగరాజకృతిని తన కోకిల కంఠంతో భానుమతి పాడగా డిశంబరు 27 న భరణి స్టుడియో రికార్డింగ్ థియేటర్లో భానుమతి సంగీత పర్యవేక్షణలో రికార్డు చేయబడింది. చిత్రంలో ఈ పాటను భానుమతి, గుమ్మడి, ఇద్దరు పిల్లలపై చిత్రీకరించడం జరుగుతుంది.

ఇప్పటికి రికార్డు అయిన 5 పాటల్లో 2 పాటల చిత్రీకరణ జరిగింది. జనవరిలో ఇన్‌డోర్, ఫిబ్రవరిలో అవుట్‌డోర్ షూటింగులు జరుగుతాయి.

'అంతా మనమంచికే'వంటి ప్రయోజనాత్మక చిత్రాన్ని నిర్మించి, ప్రజల మెప్పు బడసిన భానుమతి తన చిత్రంలో ప్రత్యేకతను చూపించి మరోసారి ప్రేక్షకుల అభిమానం పొందడం తప్పదని చెప్పక తప్పదు.

పద్మశ్రీ భానుమతి, గుమ్మడి, రాజనాల, చంద్రమోహన్, పద్మనాభం, అల్లురామలింగయ్య, పొట్టిప్రసాద్, నీలూఅయ్యర్, ప్రమీల, రమాప్రభ, కవిత, మాష్టర్ శ్రీధర్, బేబీసరళ నటిస్తున్న ఈ చిత్రానికి మాటలను జూ. సముద్రాల, సంగీత పర్యవేక్షణను భానుమతి, సంగీతాన్ని సత్యం, ఛాయను లక్ష్మణగోరె, స్క్రీన్‌ప్లే, కథ,

దర్శకత్వాలను భానుమతి నిర్వహిస్తున్నారు. విడుదల నవయుగ.

## సప్తగిరి ప్రొడక్షన్సు

వై. నరసింహస్వామి, జె. భీమచెట్టి నెలకొల్పిన నూతనసంస్థయే సప్తగిరి ప్రొడక్షన్సు. ప్రఖ్యాతదర్శకులు కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రం తాలూకు షూటింగు జనవరి 22 నుండి 27 వరకు, ఫిబ్రవరి 12 నుండి 13 వరకు వాహినీ స్టుడియోలో జరుగుతుంది. ఫిబ్రవరి 12, 13 తేదీలలో విజయాగార్డెన్సులో రికార్డింగుకూడ జరుగుతుంది.

యస్. వి. రంగారావు, నాగభూషణం, కృష్ణంరాజు, శ్రీధర్, రావికొండలరావు, కె. వి. చలం, సి. హెచ్. కృష్ణమూర్తి, విజయనిర్మల, రాధాకుమారి ముఖ్యతారాగణమైన ఈ చిత్రానికి కెమెరాను వి.ఎస్.ఆర్. కృష్ణారావు చేపట్ట, సంగీతాన్ని రాజేశ్వరరావు సమకూర్చ, మాటలను సముద్రాల జూనియర్ వ్రాయ, కూర్పును బి. గోపాలరావు, కళను తోట నిర్వహిస్తున్నారు. పూజారి వెంకటేశప్ప, జె. రాధాకృష్ణ ఈ చిత్రానికి సహనిర్మాతలు.

## 25 రోజులు 'శారద' షూటింగు

రాజమండ్రి సమీపానగల ఇనగంటివారి పేట అనే గ్రామముంది. ఈ గ్రామ ప్రాంతాలలో అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్‌వారి 'శారద' చిత్రం అవుట్‌డోర్ షూటింగు జరిగింది. కథానాయక శారదయిల్లు, డాక్టరు మూర్తి ఇల్లు, డిస్పెన్సరీ, మునసబు రాఘవయ్య ఇల్లు అవుట్‌డోర్‌లో నిర్మించిన సెట్లలో చాలా సహజంగా చిత్రీకరించబడ్డాయి. ఇనగంటివారిపేట, గుమ్మలదొడ్డి ప్రాంతాలలో—గుడి, కోనేరు మున్నగుచోట్ల నాల్గుపాటలను కూడా చిత్రీకరించారు. మంగళగౌరీవ్రతం, ఆపై నదిలో జ్యోతులు వదలే దృశ్యాలు ఎంతో సహజంగా చిత్రీకరించడం జరిగింది.

గోదావరినదీ ప్రాంతంలోని రేవులో కొన్ని దృశ్యాలను, ఆర్కులైట్ల సహాయంతో నైట్ దృశ్యాల కొన్నింటిని వ్యయప్రయాసలకోర్చి చిత్రీకరించగా, పోలీసు బందోబస్తు లేకుండా నిర్విఘ్నంగా కొనసాగింది షూటింగు క్రాంతికుమార్ అధ్వర్యంలో. ఆ గ్రామప్రజలందించిన సహాయ సహకారాలకు పత్రికా ముఖంగా కృతజ్ఞత అర్పించారు చిత్రనిర్మాతలు.

ఈ షెడ్యూలులో శోభన్‌బాబు, శారద, జయంతి, సత్యనారాయణ, రావుగోపాలరావు పాల్గొన్నారు. వీరుగాక ఇంకా ఈ చిత్రంలో రాజబాబు, అల్లురామలింగయ్య, శాంతాదేవి, సారధి, బేబీడాలి మున్నగువారు ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు.

పి. రాఘవరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. జ్యోతీ ఫిలింస్ విడుదలచేసే ఈ చిత్రానికి బొర్లిముంత మాటలను, జి. కె. రాము ఛాయను, కుదరవల్లి కళను, అంకిరెడ్డి కూర్పును, చక్రవర్తి సంగీతాన్ని నిర్వహించే బాధ్యతలను స్వీకరించారు.

## ఎన్. టి. ఆర్. స్విచ్ ఆన్‌చేసిన నాగేశ్వర ప్రొడక్షన్సుచిత్రం

గుడివాడలోని గౌరీశంకర్ టాకీస్ అధినేత యం. నాగేశ్వరరావు నాగేశ్వర ప్రొడక్షన్సును స్థాపించి తమ తొలికానుకగా 'ఉత్తమ ఇల్లాలు' చిత్రాన్ని జనవరి 7 వ తేదీ ఉదయం 9—30 గంటలకు గోల్డెన్ స్టుడియోలో పి. సాంబశివరావు దర్శకత్వంలో ప్రారంభించారు.

నటరత్న—పద్మశ్రీ ఎన్. టి రామారావు కెమెరా స్విచ్ ఆన్ చేయగా, నిర్మాత పింజల సుబ్బారావు క్లాప్ కొట్టగా నాగభూషణంపై తొలి సన్నివేశం చిత్రీకరించడం జరిగింది.

బాలసుబ్రహ్మణ్యం వ్రాసిన ఈ చక్కటి కుటుంబ కధకు పినిశెట్టి సంభాషణలను వ్రాశారు. మాష్టర్ వేణు సంగీతాన్ని సమకూరుస్తున్నారు. కళను బి. ఎన్. కృష్ణ, కెమెరాను వి. యస్. ఆర్. స్వామి నిర్వహిస్తున్నారు.

కృష్ణ, నాగభూషణం, ధూళిపాళ, రాజబాబు, మిక్కిలినేని, చంద్రకళ, విజయలలిత, అంజలి, రమాప్రభ, కృష్ణకుమారి ప్రభృతులు నటిస్తున్న ఈ సముజ్వల కుటుంబ గాధాచిత్రాన్ని శరవేగంతో నిర్మిస్తున్నారు నిర్మాత నాగేశ్వరరావు.



**"నిజరూపాలు"లో రామకృష్ణ, విజయనిర్మల.**

## రాష్ట్రపతి సతీమణిచే బడిపంతులు చిత్రం సందర్శన

ఆంధ్రప్రదేశ్‌లో దిగ్విజయంగా ప్రదర్శింపబడుతూ, ఆబాలగోపాలంచే ప్రశంసింపబడుతున్న త్రివేణీ ప్రొడక్షన్సువారి 'బడిపంతులు' చిత్రం డిశంబరు 22 వ తేదీ సాయంత్రం మద్రాసు ఏ వి యం. సు డియో డీలక్సు థియేటర్లో రాష్ట్రపతి సతీమణి శ్రీమతి సరస్వతిబాయి గిరిగారు ప్రత్యేకంగా చూడడం జరిగింది.

ఒంట్లో అస్వస్థతగా వున్నా, మూడు గంటలసేపు ఓపిగ్గా కూర్చొని, చిత్రాన్ని వీక్షించి బడిపంతులుగా నటరత్న నటన బహుచక్కగా వుందని, సంగీతం సుమనోజ్ఞంగా వుందని, ముఖ్యంగా 'నీ నగుమోము' అన్న పాట హృదయాన్ని ద్రవింప చేస్తుందని అభిభాషించారు నరసరాజుగారి మాటలు చిత్రానికి నిండుదనాన్నిచ్చాయి అని అభినందించారు

అదే చిత్రానికి వచ్చిన ఎన్ టి. రామారావు సతీమణివంక తిరిగి 'మీ వారు చాల గొప్ప నటుడమ్మా, వారికి నా అభినందనలు అందచేయండి' అన్నారు

మద్రాసు స్టుడియో థియోటరులో చిత్రం చూడటం రాష్ట్రపతి సతీమణికిదే ప్రథమం.

## పూజామందిరంలో జమున పాట!

భార్య రజని పోయింతర్వాత వికలమైన మనస్సుతో డాక్టర్ రాజేంద్ర రోగుల్ని చూడడమే మానేశాడు కాని ఒక పూర్ణగర్భిణి ప్రసవ వేదనతో తల్లడిల్లిపోతుందని, శోభ బ్రతిమాలి డాక్టర్ని ఆపరేషనుకు తీసుకెళ్లింది

ఆపరేషన్ విజయవంతమై, తల్లీ—పిల్లలిద్దరూ క్షేమంగా వున్నారని తెలిసిన మరుక్షణం శోభ హృదయం ఆనంద డోలికల్లో మునిగిపోయింది, పారవశ్యం అవధులుదాటి పాటగా మారింది. పూజామందిరంలో భగవంతుని ముందుచేరి

## సినిమా

'నా మాట నీవు మన్నించావు
మనసారా నన్ను కరుణించావు
కుమిలే మనసును ఓదార్చావు
మళ్లీ మనిషిగ చేశావు .. ..
ఆడించేది, పాడించేది అంతా నీవేనురా'
చిత్రము నీ లీలరా—దేవాచిత్రమునీలీలరా

అంటూ గానం చేసింది శోభ. హృద్యమైన ఈ సన్నివేశం కె యస్ ఆర్ పిక్చర్సువారి 'బంగారు మనసులు' చిత్రంలోనిది

జమున, సత్యనారాయణ, రాజసులోచన, చంద్రమోహన్, శకుంతల, లీలారాణి, ఛాయాదేవీ, మీనాకుమారి, జ్యా, శ్రీరంజని, మాగోపీ త్యాగరాజు, అల్లు రామలింగయ్య, బేబీ గౌరీ ప్రధాన భూమికలను, కృష్ణకుమారి గెస్టు పాత్రను ధరిస్తున్న ఈ చిత్రానికి దర్శక—నిర్మాత కె యస్. రెడ్డి శ్రీ లక్ష్మీనారాయణ పిక్చర్సు విడుదల చేయనున్న ఈ చిత్రానికి సంగీతం—సత్యం, కథ—మాటలు కృష్ణమోహన్, ఆర్టు బి. ఎస్ కృష్ణ, కెమెరా కన్నప్ప, ఎడిటింగ్ కందస్వామి

## విజయా ప్రొడక్షన్స్‌లో ఇద్దరు హీరోలు

ప్రముఖ నిర్మాణ సంస్థ, ప్రజల అభిమానాన్ని ఎక్కువగా చూరగొన్న సంస్థఅయిన విజయా ప్రొడక్షన్స్ అతి త్వరలో ఒక తెలుగు చిత్రాన్ని ప్రారంభించబోతున్నారు.

హిందీలో ఢంకా బజాయిస్తున్న ఒక చిత్రంయొక్క దక్షిణ భాష నిర్మాణ హక్కులను యీ సంస్థ - కొన్నదన్న విషయం పాఠకులకు తెలుసు

తెలుగు చిత్రానికి డి వి. నరసరాజు రచన్ను, రమేష్ నాయుడు సంగీతాన్ని సమకూరుస్తున్నారు 'రాముడు—భీముడు'ఫేం తాపీచాణక్య యీ చిత్రానికి దర్శకుడు.

ఈ చిత్రంలో పెద్ద కధానాయకులిద్దరు ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు రెండు ప్రధాన పాత్రలను ఒకమేటినటి ధరిస్తూంది



'నేరము-శిక్ష'లో కృష్ణ, భారతి

ఆ నాయకులు శోభన్—కృష్ణ, కృష్ణ శోభన్ బాబులే ద్విపాత్రాభినయం చేస్తున్న తార మీ అభిమాన నటి వాణిశ్రీయే

లోగడ విజయాసంస్థ నిర్మించిన చిత్రాలన్నీ ఒకదాన్ని మించి మరొకటి ప్రజాదరణను పొందియున్నాయి 'పాతాళభైరవి, గుండమ్మకథ, మిస్సమ్మ' చిత్రాలను మనం మరువగలమా?

విజయా సంస్థకి అఖిలభారత ప్రజల అభిమానం, ఆదరం వుంది మంచి చిత్రాలను తీసారు గనక

## దేముడు చేసిన మనుషులు!

హీరో కృష్ణ సమర్పించు పద్మాలయా కంబైన్స్‌వారి ఈస్ట్‌మన్ కలర్‌చిత్రం యిది ఈ చిత్రాన్ని 'పండంటి కాపురం' నిర్మాత జి హనుమంతరావు నిర్మిస్తున్నారు కథ కూడా ఆయనదే మాటలను మోదుకూరి జాన్సన్ వ్రాస్తున్నారు

*రమేష్ ప్రవేశం!*

ఈ చిత్రానికి రమేష్ నాయుడు సంగీత సారధ్యం వహిస్తున్నారు. వీరికి యిప్పుడు

విపరీతమైన డిమాండు వుంది. పాటల కంపోజింగు జనవరి 1 న ప్రారంభమైంది. జనవరి 17 న పాటల రికార్డింగు.

*రామారావు అంగీకారం!*

పద్మాలయా కంబైన్స్ నిర్మిస్తున్న యీ చిత్రంలో నటించడానికి ఎన్టీరామారావు అంగీంచేంచారు. ఎన్టీఆర్—కృష్ణ అన్న, దమ్ములుగా నటిస్తారు. ముఖ్యపాత్రలను జమున, విజయనిర్మల, విజయలలిత, ఎస్వరక్ష్మి, గుమ్మడి, నాగభూషణం, సత్య నారాయణ, అల్లు రామలింగయ్య పోషిస్తారు. ఈ చిత్రానికి వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, కోటగిరి గోపాలరావు కూర్పును నిర్వహింప, వి. రామచంద్రరావు దర్శకత్వాన్ని చేపట్టారు. తారకరామాద్వారా విడుదలయ్యే చిత్రం యిది.

రెండు వారాల్కిందట నేను వ్రాశాను: కృష్ణ, రామారావుతో సినిమా తీస్తారని. అది నిజమైంది. చెప్పినది చేసి చూపెట్ట గల శక్తివంతుడు కృష్ణ.

## తాతా—మనవడు

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మించిన సందేశాత్మక చిత్రం యిది. జన్మయిచ్చిన తల్లి, తండ్రులను విస్మరించి, అవమా నించి, విచ్చల విడిగా విహరించడంవల్లకలిగే అనర్థాలను కథకుడు దాసరి నారాయణరావు ఎంత చక్కగా చిత్రించారో?

వెర్రి వ్యామోహంలోపడి, లేనిదాన్ని వున్నదిగా చెప్పి, అనవసరమైన పెద్దరికాన్ని ఆపాదించుకోవడంవల్ల కలిగే యిబ్బందులను దాసరి తన మాటల్లో ఎంత బాగా వివరించారో?

అసభ్యతగాని, అసహ్యతగాని లేని చిత్రంగా రూపొందించడానికి నారాయణరావు ఎంత కృషి సలిపారో? అందుకే 'తాతా—మనవడు' చిత్రానికి షెన్నారువారుకూడా ప్రశంసల్ని అందచేశారు.

జేమ్స్‌బాండ్‌చిత్రాలనేగాదు—జెమ్‌లాంటి చిత్రాన్నికూడా నిర్మించగలను', అని నిరు పించారు నిర్మాత రాఘవ. ఈ చిత్రానికి రమేష్‌నాయుడు సంగీత సారధి.

ముఖ్యపాత్రధారులు: ఎస్వీఆర్, గుమ్మడి, రాజబాబు, సత్యనారాయణ, విజయనిర్మల, అంజలీదేవి, రేణుక ఈ చిత్రం తారక రామాద్వారా విడుదలవుతుంది.

*రెండవ చిత్రం!*

మరొక సందేశాత్మక కథను దాసరి నారాయణరావు వ్రాస్తున్నారు. బహుశా ఫిబ్రవరిలో సెట్స్‌కి వెళ్లవచ్చు, అన్నారు నిర్మాత రాఘవ. ఈ చిత్రంలో కొత్త వాళ్లకు అవకాశం యివ్వాలి, అని చెప్పారు.

## స్టుడియోల నాయకుడు!

మద్రాసులో విజయా, ఏ. వి. ఎమ్., జెమినీ స్టుడియోలు తెలుగు చిత్రాలను నిర్మిస్తున్నాయి. ఈ మూడింటిలో శోభన్ బాబు నటిస్తున్నారు.

హైద్రాబాదు సారధి స్టుడియో నిర్మించే చిత్రంలోకూడా ఈయనే నాయకుడు. అందుకే శోభన్‌బాబును స్టుడియోల నాయకుడు అంటున్నాను.

## జీవితం

శ్రీధర్ ప్రొడక్షన్స్‌వారి 'జీవితం' రీ—రికార్డింగుకూడా పూర్తయింది. విడుదల కోసం వురకలు వేస్తూ వుంది. సూర్య చంద్రరావు—గిరిబాబులు నిర్మించిన యీ చిత్రానికి కె. ఎస్. ప్రకాశరావు దర్శకుడు.

సంగీతాన్ని రమేష్ నాయుడు, సంభాషణ లను భమిడిపాటి సమకూర్చారు. ముఖ్య పాత్రలను శోభన్, శారద, జయంతి పోషించారు. లక్ష్మి విడుదల.

—శ్రీనివాస్



'జీవనతరంగాలు'లో లక్ష్మి.

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

## కాపురంచేశాక పెళ్లి!

బ్రెజిల్ ఎసిఫ్‌లో జోషి ఇనాషియోడి సెల్వా అనే ఆయన జోసిఫా మార్గరిడాడిసిల్వాతో 42 సంవత్సరాలు కాపురం చేశాక, అమీాదట ఆమెను నిశ్చయంగా వివాహం చేసుకోవాలని తీర్మానించాడట 1901 లో పుట్టిన యీాయనకు 71 సంవత్సరాలుట ఆయనతో 42 ఏళ్ళు దాంపత్య జీవితం గడిపిన ఆమెకు నూరేళ్ళట అనగా ఆమె అతనికన్నా 29 ఏళ్లు పెద్దదట — ఫైన్!

### శాసనమండలి సభ్యునికిగాజులు,

కొత్తగూడెంలో వో ఆరుగురు విద్యార్థినులు జనవరొకటో తేదీ కాంగ్రెసు శాసనమండలి సభ్యుడు వెంకటప్పయ్యగారింటి ఎదుట 'జై తెలంగాణా' పతాకాన్ని ఎగరేసి, యీా ఉద్యమంలో ఆయన చేరనందువల్ల ఆయన నుదుట బొట్టుపెట్టి,




గాజులను బహూకరించారుట — అవునూ ప్రతీ మగాడకీ యిలా గాజులను బహూకరించడం మహిళాలో కొన్ని అవమానించుతున్నట్లు కాదటా! వైనాట్ స్టాపిట్! ఫుల్‌స్టాప్

### నీళ్లు తాగితే నిర్వీర్యం!

జైసాల్‌మీర్‌కు నలభై కిలోమీటర్ల దూరంలో వున్న సామా గ్రామంలో వున్న ఒకేఒక బావిలో నీరు త్రాగడం వల్ల పురుషులు నిర్వీర్యులవుతున్నారని ఆ వూరు ఆడవారంతా చేరి కలెక్టరుగారికో మహజరు సమర్పించారట ఆ వూరిలో సుమారు 500 మంది ప్రజ వున్నారట ఆవూళ్లో వేరే నుయ్యి లేనే లేనందువల్ల వున్న ఒక్కగానొక్క నూతిలో నీళ్లే వూరంతా వాడుకునేవారట ఆ నీటి ప్రభావం వల్ల (పురుషులు) పూర్తిగాగాని, కొద్దిగాగాని) నిర్వీర్యులవుతున్నారట ఈ నీటిని పరిశీలించి నీటిలోని దోషం కనిపెట్టడానికివచ్చి నాయన పక్కవూరికివెళ్ళి స్నానపానాదులు అన్నీ ముగించుకున్నాడట— ఎవరి ప్రాణమువారికి తీపి కొత్తాంధ్రవాచకం ఎన్నో క్లాసు పాటంసార్!

*    *    *

నవంబరు నెలలో ఆకాశ, సముద్ర శాఖలకు చెందిన కస్టమ్స్ అధికారులు 4,73,036 విలువ జేసే చేతి గడియారాలు, బట్టలు, విదేశీ కరెన్సీ నోట్లు, తదితరాలూ పట్టుకున్నారట — దట్సాల్ రైట్ గానీ తదితరాలనగా నేమి వగైరాలా! అంటే!!

### పోలీసు రిపోర్టు యిచ్చిన కోతి

కోడూరు గ్రామ పోలీసు స్టేషనుకు ఓ కోతి ప్రాణాలను చేతోపుచ్చుకుని వచ్చి, తిన్నగా ఇనస్పెక్టరు రాజయ్య వద్దకు వెళ్ళి, ఆయనకు నమస్కరించి కూర్చుందట (జనవరి 3వ తేదీ) ఆ కోతిని ఎవరో గాయపరచి, ప్రేగులు బయటకు లాగారట తనమీదా కిరాతకం చేసిన వానిని గురించి ఫిర్యాదు చేయలేక ఆ కోతి ఆయనకేసి చూస్తూ కూర్చుందట పశువుల డాక్టరుగారు మురళీ మోహనరెడ్డిగారు ఆ కోతికి చికిత్స చేసినా ఫలితం దక్కక ఆరోజు మధ్యాహ్నం రెండు గంటలకు అది చనిపోయిందట ఈ అఘాయిత్యం చేసిన నరాధమునికోసం పోలీసు దర్యాప్తు చేస్తోందట.




### చీరకు నిప్పు

వందవాసి తాలూకా కీళ్ సెవ్‌పట్టు గ్రామానికి చెందిన 60 ఏళ్ల చిన్నకుళంది అనే ఆవిడ తను పని చేస్తున్న వో కార్ఖానాలో నిప్పు సరి చేస్తుండగా ఆ నిప్పు ఆమె చీరకు అంటుకుని భగ్గున మండి నిలువునా కాలి చనిపోయిందట

### భారతదేశంలో బిచ్చగాళ్లు!

పవిత్ర భారతదేశం రోజుకుబిక్షగాళ్ళకోసం 11 కోట్ల రూపాయలు ఖర్చు పెడుతోందట. ఆహార పదార్థాలు యివ్వడం, కొంత ధన రూపంలో యివ్వడం జరుగుతోంద టీ మొత్తంలో మన దేశంలో సుమారు 55 లక్షలమంది బిచ్చగాళ్ళున్నారట వీరిలో 1,15,500 మంది 14 ఏళ్ళ లోపువారని, 12 లక్ష మంది 50 ఏళ్లు దాటిన వారని, మొత్తం బిచ్చగాళ్ళలో 1,50,000 మంది కుష్టురోగులని, 85 వేలమంది నపుంసకులని




8 లక్షలమంది గుడ్డివారని, 3 లక్షలమంది చెవిటివారు, మూగవారూనని, వో లక్షమంది మతి స్థిమితం లేనివారని పరిశీలకులు లెక్కలుకట్టి తేల్చారట దేశంలో సగటున ఒక్కో బిచ్చగాడూ రెండ్రూపాయ లార్జిస్తున్నాడట వీరి సంపాదనలో ఒక్కో బిచ్చగాడు సంపాదన గెజిటెడ్ ఆఫీసర్ల జీతాలు కూడా దాటిపోయే అవకాశాలు లేవా ఎందకు లేవు! ఒండుకున్నమ్మకు ఒకటే కూర, దండుకున్నమ్మకు దంచుకున్నన్ని కూరలు అన్న సామెత కర్థ మేమి!!

### విధినిర్వహణలో పట్టుదల

ఉరవకొండలో రిలే నిరశన వ్రతం చేస్తున్న (జై ఆంధ్ర) పంచాయతీ మాజీ సర్పంచి యం సి. నరసింహులుగారు తన దాయాది మిడతల రంగయ్య చనిపోయిన వార్త విన్నా సరే, చెదరకుండా 24 గంటలూ తన విధిని నిర్వర్తించి మరీ లేచారట.

ఆర్కాటుకు చెందిన కొత్తాంగుళం అనే గ్రామంలో గోవిందస్వామి అనే ఆయన భార్య యశోద తన ఏడేళ్ల రాజేశ్వరిని, ఆరేళ్ళ రాణిని (కూతుళ్ళు) తీసుకుని భర్తమీద కోపగించుకుని పుట్టింటికి వెళ్ళిపోయిందట. ఇది జరిగిన మూడు సంవత్సరాలకు చిదంబరానికి చెందిన ఒకామెను గోవిందస్వామి రెండో పెళ్ళి చేసుకున్నాడట. ఆనక తన మొదటి భార్యను, పిల్లలనూ కూడా పుట్టింటి నుంచి తెచ్చుకున్నాడట. తత్ఫలితంగా యిద్దరు భార్యలకు పచ్చగడ్డి వేస్తే భగ్గుమని, అది భరించలేక రెండో భార్య పుట్టింటికి వెళ్ళిపోయిందట. ఆకోపంతో రాత్రి నిద్రపోతున్న తన మొదటి భార్య యశోదను గోవిందస్వామి పీక నులిపి చంపి, పెరట్లో గొయ్యి తీసి పాతిపెట్టి పైన చెత్తా చెదారం కప్పేశాడట.

### కుటుంబ కలహాలు–

### కూతురికి విషం–తల్లి ఆత్మహత్యా

తమిళనాడుకు చెందిన పోయారు అనే వూరిలో 55 ఏళ్ళ పొన్నుస్వామి భార్య ఎల్లమ్మ కుటుంబ కలహాలు భరించలేక తన అయిదుగురు పిల్లలలో పెద్దపిల్ల 10 ఏళ్ళ కమలకు విషం కలిపిన పెరుగు త్రాగించి, తాను త్రాగిందట. ఫలితంగా యిద్దరూ వాంతులు చేసుకుని విలవిలా తన్నుకుని చనిపోయారట.

### ప్రయాణీకుల ఆగ్రహం

మైసూరురాష్ట్రం దవణగిరికి చెందిన చెవిన హళ్ళిలో వో ప్రయివేటు బస్సు తన సొంతస్థలం లోంచి వెళుతూంటే ఆ స్థలం సొంతదారు చెన్నబసప్ప ఆ బస్సును అటకాయించాడట. బస్సులో వున్న మురుగప్ప అనే ఆయన సర్ది చెప్పబోయేసరికి చెన్నబసప్ప ఆతన్ని చితక తన్నాడట. దాంతో బస్సులో జనం కోపంతో రెచ్చిపోగి చెన్న బసప్ప మీద విరుచుకుపడే సరికాతను ఇంట్లోకి పారిపోయి, తలుపు లోపల వేసుకుని కూర్చున్నాడట. అయినా కోపం చల్లారని ప్రయాణీకులు ఆ ఇంటిమీద కిరసనాయిలు పోసి, నిప్పంటించరట. తత్ఫలితంగా చెన్నబసప్ప, ఆతని భార్య శాంతమ్మ, ఇద్దరు కొడుకులు బసప్ప, శేఖరప్ప—మొత్తం నలుగురూ ఆ మంటలో కాలి మసైపోయారట.

### నూతిలోపడి ముగ్గురి మరణం

కాళీపాలెం (తిరుప్పూరు) కు చెందిన మురగసామి. గవుండరు భార్య రామాళ్ ఒక తోటలో పని చేస్తోందట. ఆవిడ కొడుకు 9 ఏళ్ళ వేలుమణి, అతని స్నేహితుడు 10 ఏళ్ళ రంగస్వామి ఆ తోటలో ఆడుకుంటున్నాడట. పని పూర్తయ్యాక రామాళ్ పిల్లలను కేకేసి మంచి నీళ్ళు త్రాగి యింటికి పోదామని ఆ తోటలోనేవున్న దిగుడు బావిలో దిగిందట నీళ్ళకోసం వొంగేసరికి రంగస్వామి కాలు జారి నూతిలో పడ్డాడట. అతని వెనుక వేలుమణి కూడా పడ్డాడట. వీరిద్దరినీ కాపాడడానికి రామాళ్ కూడా నీళ్ళల్లో దూకిందట. కానీ, యిద్దర్నీ పట్టుకుని యీదలేకపోవడంవల్ల ఆ యిద్దరితో కలసి మునిగి చనిపోయిందట.

### వల్లకాడులో శవం!

ఆరూరు తాలూకా పయర్వట్టి వూరుకు చెందిన 35 ఏళ్ళ బావాయి అనే ఆమె శవం జంబేరికి చెందిన వల్లకాడులో పడివుందట. ఆమె మెడమీద కత్తిగాట్లు వున్నాయట. ఈమెకు నలుగురు పిల్లలట. ఈవిడ నడుం ఎముక చికిత్స కోసం పాండిచ్చేరి ఆసుపత్రిలో కొన్నాళ్ళుండి వచ్చిందట. ఇది ఆత్మహత్యా, అల్లదు (లేక) హత్యా అని పోలీసు తీవ్రంగా విచారిస్తోంది.

### కుముదం పత్రికాధిపతిపై తమిళనాడు ముఖ్యమంత్రి పరువు నష్టం దావా!

కుముదం వార పత్రిక సంపాదకుడు ముద్రాపకుడు, ప్రచురణకర్తపైనా, రాష్ట్ర సి. పి. ఐ. కార్యదర్శి కల్యాణసుందరంపైనా తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి పది లక్షలకు పరువు నష్టం దావా వేశారట.

ముఖ్యమంత్రికి సొంతాని కొంత వ్యాపారం వుందని, తన కొడుకు ముత్తు నటించిన వో సినిమా నిర్మాణానికోసం నగరంలో ఒకరికి వో పెద్ద ప్రభుత్వ కాంట్రాక్టు యిచ్చి అతనివద్దనుంచి 15 లక్షలు అప్పు సంపాదించారని, ఈవిధంగా ఆయన ముఖ్యమంత్రిగా తన అధికారాన్ని స్వలాభానికి వినియోగపరుచుకుంటున్నారని, డిశంబరు 17 వ తేదీన సి. పి. ఐ. పత్రిక "జనశక్తి"లో ప్రచురించబడిన దానిని పేర్కొంటూ ముఖ్యమంత్రి యీ పరువు నష్టం దావా వేశారట.

# వారఫలం

## 9-2-1973 శుక్రవారం మొదలు 15-2-1973 గురువారం వరకు

**మేషం :** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రతిభాజనుల పరిచయాలు యేర్పడతాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

**వృషభం :** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవప్రతిష్ఠలు బాగుంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మిథునం :** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలక్కి నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కర్కాటకం :** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం :** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు.

స్త్రీలకు— ప్రయాణాలోచనలు చేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారంమధ్యలో అన్నివ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రతిభాజనం గల పరిచయాలు యేర్పడతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అనుకూలత లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

**వృశ్చికం :** ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం మధ్యలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రతిభాజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో అనవసరమైన ప్రయాస కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఆభరణాల కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు :** మునుముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. పోటీదారితో వాదప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**మకరం :** సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. పోటీదారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కుంభం :** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులకు సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అన్నివ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

—మిత్రోష్

# మారాజులొచ్చారు




ఈ కథ ఎక్కడైనా, ఎప్పుడైనా, ఏ వేళైనా, ఏ వూళ్ళోనైనా జరిగుండొచ్చు!

* * *

ఆవేళ సూర్యుడు నిప్పులు కక్కుతున్నాడు; ఎండకు రోడ్డుమీదున్న తారు కరుగుతోంది. వడగాలి చాచి లెంపకాయ కొట్టినట్టుగా వుంది. రోడ్డుకు కొంచెం దూరంగా కొండలమీదున్న చెట్లు కొన్ని వందల ఇళ్ళు కాలుతున్నట్టు ఎర్రగా వుంది. ఈస్ట్మన్‌కలర్‌లో రాక్షసుడు కక్కుతున్న రక్తంలా వుంది. రోడ్డుకు మరో వైపున వున్న చెట్లు ఎండి కాలిన శవాల్లా వున్నాయి!

ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా వుంది. కనుచూపుమేరలో ఎక్కడా ఏ విధమైన సంచారం లేదు. తిన్నగావున్న రోడ్డుమీద ఎండలో ఒక్కకారు కూడా నడవడం లేదు!

రోడ్డుకు ప్రక్కవున్నసే ఒక చెట్టుకింద తిరువెంగళం కూర్చున్నాడు. అతని చేతిలో సుత్తి వుంది. ఆ సుత్తితో అతను కొండ రాళ్ళను బద్దలు కొడుతున్నాడు. ప్రొద్దుట నుంచీ తిరువెంగళం కదలకుండా అలాగే పని చేస్తున్నాడు. అయినా. గుట్ట తరగడం లేదు. శరీరంనిండా చెమట్లు పట్టాయి. చేతులు నొప్పి పెడుతున్నాయి. వెన్నులోంచి పోటుగా వుంది. అయినా అతను పని మానలేదు.

చినిగిపోయిన ముతకచొక్కా తడిసి పోయింది. చెట్ల ఆకుల్లోంచి ఎండ శరీరం మీద పడుతోంది. నుదుటమీద కారుతున్న చెమటను చొక్కాతో తుడుచుకున్నాడు. ఆకలితో ప్రేవులు మెలికలు తిరుగుతున్నాయి. కళ్ళు లోతుకుపోయి కృత్రిమంగా అమర్చినట్టుగా వున్నాయి పెరిగిపోయిన గడ్డంమీద చెమట బిందువులు నిలచివున్నాయి.

అవి ఏ క్షణంలోనైనా చెదరి ఇసుకలో పడి ఇంకిపోవచ్చు! అతని జీవితంకూడా అంతే—చెమట బిందువులాటింది! అతను పడుతున్న శ్రమకు ఫలితం వుండడంలేదు!

ఇద్దరు పిల్లలనూ, భార్యని పోషించాలి. అక్కడికి భార్యకూడా కష్టపడి పని చేస్తూనే వున్నది. ఎండలో, వానలో, చలిలో మంచులో కష్టపడి పన్చేసినా సంసారం

సుఖంగా గడవడం లేదు!

తిరువెంగళం ముఖంమీదే పట్టిన చెమటను మాసినతుండుతో తుడుచుకున్నాడు. చెట్ల ఆకుల్లోంచి ఎండసూటిగా, వాడిగా పడుతోంది. అతను తలెత్తి చూశాడు.

దూరంగా అడవిలోంచి కట్టెలమోపుతో వస్తూ శాయమ్మ నడవలేక నడుస్తోంది. ఆమె నెత్తిమీద కట్టెలబరువే కాకుండా మరో బరువూ, భారంకూడా పెరుగుతోంది. ఇంకా కొన్ని నిమిషాల్లో నెత్తిమీదున్న బరువును దింపుకోగలదుగానీ కడుపులోవున్న బరువును దింపుకోలేదు! బతికున్నంతకాలం ఆ బరువును స్వీకరించవలసిందే. తప్పదు.

ఇద్దరు పిల్లలతో సంసారాన్ని నెట్టుకు రావడం దుర్భరంగా వుంటుంటే, మనిషి శరీరవాంఛలకూ తృప్తికీ నిదర్శనంగా మరో ప్రాణి. సృష్టివిచిత్రంలో ఇది మరో విత్రం!

శాయమ్మ దరిదాపు రోడ్డుమీదకొచ్చింది. ఆమె ముఖమంతా కందిపోయి మసిపూసినట్టుగా వుంది. జుట్టుముడి వూడిపోయి తలంతా చిందరవందరగా వుంది. విడిపోయిన కురుల్ని మళ్ళా ఒకచోట చేర్చాలంటే కట్టెలమోపును దింపాలి. దించి ముడివేసుకోవడం కష్టం!

కళ్లకు అడ్డుపడుతున్న వెంట్రుకల్ని పక్కకి తీసుకుంటూ, మరోచేత్తో కట్టెల్ని గట్టిగా పట్టుకుని నడుస్తోంది. ఆయాసంతో ఆమె శ్వాస ఎక్కువవుతోంది. కడుపులో దేవినట్టుగా, ప్రేవులు కదులుతున్నట్టుగా వుంది. వాంతి వచ్చేట్టుగా వుంది. కళ్ళముందు చీకటితెరలు దట్టంగా పేరుకుంటున్నట్టుగా అవుపడుతోంది. అయినా, శాయమ్మ నడవడం మానలేదు.

భార్యని అలా చూడడంతోనే తిరువెంగళం చేస్తున్నపని ఆపి గబగబా నడుస్తున్నంత తొందరగా వెళ్లి కట్టెలమోపును పట్టుకున్నాడు. నెమ్మదిగా భార్యని పొదివిపట్టుకుని గుడిసెదగ్గరకు తీసుకెళ్ళాడు.

తొమ్మిదేళ్ళ బుడతడూ, ఆరేళ్ళ అమ్మాయీ గుడిసె ప్రక్కగావున్న చెట్టు క్రింద మిగతా పిల్లలతో ఆడుకుంటున్నారు. ఆ పసిపిల్లలకు ఎండ తగులుతున్నట్టుగా అనిపించడంలేదు. ఏ బాధ్యతలూ, బరువులూ ఆ పిల్లలకు లేవు. వున్నబాధల్లా కడుపునిండా తిండి లేకపోవడమే!

తల్లినీ తండ్రినీ చూడ్డంతోనే పిల్లలిద్దరూ ఆడుతున్న ఆటనాపేసి వొచ్చి కాళ్లకు పెనవేసుకున్నారు.

'వుండండ్రా! అమ్మ అలసిపోయనాది' అంటూ తిరువెంగళం భార్యని లోపలకు తీసుకెళ్లి నులకమంచంమీద పడుకోబెట్టాడు.

శాయమ్మ దిగులుగా మంచంమీద పడుకుంది.

'నువ్వేటిలా ఇదవుతున్నావ్. అన్నం నే నొండుతాలే. ఒరేయ్ బుడతడా నువ్వు బయటకెళ్లి పుల్లలేరుకు రారా' అన్నాడు.

* * *

ఆకాశం, నక్షత్రాలూ, చెట్లు అన్నీ నిద్రపోతున్నాయి. ఎక్కడో ఏ విధమైన శబ్దమూ లేదు. అంతా కాటుకలాంటి చీకటిలో కలిసిపోయింది. చుట్టూ అడవి ప్రాంతం. నలుదిశలా ఆవరించుకున్న కొండలు. వాటిమధ్య తిరువెంగళంలాటి పాటుగా మరో నలభై సంసారాలు బ్రతుకుతున్నాయి.

నివాసయోగ్యంకాని ఈ అడవీ, ఈ కొండలే తమకింత భుక్తిని ప్రసాదిస్తున్నాయి. ఇది ఆశ్చర్యంగానే వుంటుంది. అసలు సృష్టిలో పనికిరాని వస్తువంటూ ఒక్కటికూడా వుండదేమో! విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ వాటి వాటి అవసరాలు కూడా పెరుగుతున్నాయి.

సరిగ్గా ఈ ప్రాంతానికి ఐదుమైళ్ళ దూరంలో ఒక వూరుంది. ఆ వూళ్ళో అన్ని సదుపాయాలూ, అన్ని సౌకర్యాలతో పాటుగా అనారోగ్యం కూడా వుంది. సినిమాలూ, కాఫీ హోటళ్లూ, పార్కు, క్లబ్బూ — నాగరికతకు కావలసిన అన్ని హంగులూ వున్నాయి.

అతి సామాన్యమైన బ్రతుకును రోజు రోజుకూ గడుపుకొంటున్న తిరువెంగళంలాటి ఇంకా కొంతమంది ఆ వూరుకు కట్టెలు తీసుకుని వచ్చి అమ్ముకోవడం తప్పదు. కట్టెలమ్ముకోగా వచ్చిన డబ్బుతో వారం పదిరోజుల వరకూ సరిపడా నిత్యావసర వస్తువులు కొనుక్కుంటారు. అవి అయిపోయేంతవరకూ వారు కష్టపడి పనిచేసి మళ్ళా గడపడానికి పాటుపడవలసిందే.

నారి జీవితాలింతే. బ్రతుకులో నిటువంటి ఒడుదుడుకులూ వున్నాయని అవి సించకపోయినా, పిల్లలకు జ్వరమొచ్చి లేవలేకపోయినా, భార్యలు ప్రసవవేదన భరించలేక చచ్చిపోయినా అక్కడ ఆ భయంకరమైన కొండప్రాంతంలో సహాయం లభించదు!

తిరువెంగళం బయట తెగిపోయిన తాళ్ల మంచంలో పడుకున్నాడు. అతని పక్కలో కొడుకు నిద్రపోతున్నాడు.

రాత్రి, నిశ్శబ్దం. ఆకాశం నల్లగావుంది. నల్లగావున్న ఆకాశం దుప్పటిమీద మల్లెపూలు చల్లినట్టుగా నక్షత్రాలున్నాయి. వుక్కగా వుంది. ఆకులు కదలడంలేదు. రాక్షసుడు చాచిన నాలుకలా కొండలు. ఏదో పేరు తెలియనిపిట్ట వికృతంగా అరుస్తుంటూ పోతోంది. ఆ సమయంలో — భయంకరమైన క్యాన్సర్‌వ్యాధి వ్యాపించినట్టుగా వుంది!

తిరువెంగళం కళ్లువిప్పి ఆకాశంకేసి చూశాడు. అనంతమైన ఆకాశం విశాలంగా కనిపించింది. ఆకాశపు చివరఅంచులెక్కడుందో? ఈ భూమీ, ఆకాశం, గాలీ, నీరు—ఎప్పుడు ఎలా ఏవిధంగా పుట్టాయో తెలీదు. ఇవి లేనిదే మనిషి మనుగడ లేదు!

పక్కలో పడుకున్న బుడతడు కదిలి తండ్రిని గట్టిగా కౌగలించుకుని కాళ్ళు పొట్టమీద పెట్టాడు. నిద్రలో ఏదో కలవరిస్తున్నాడు.

కొడుకు కౌగలింత తిరువెంగళానికి హాయిగా వుంది. వెచ్చగావుంది. పులకింతగా వుంది తన జీవితానికి, తన వంశానికి ప్రతినిధిగా కొడుకు నిలుస్తాడు.

తిరువెంగళం కొడుకు జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి ప్రేమగా నిమురసాగాడు. కొడుకు నిద్రలో నవ్వుతున్నాడు. కొన్ని క్షణాలు తిరువెంగళం అలాగే బుడతడి ముఖంలోకి చూశాడు. అప్పుడతను అనిర్వచనీయమైన సంతోషంతో మురిసిపోయాడు.

అవును! మనిషి మనుగడ ఏదీ శాశ్వతం కాదు. డబ్బూ, హోదా మనిషిని కొంతకాలమే వరిస్తాయి. శాశ్వతంగా వరించేది పుత్రప్రేమ. ఎన్నికష్టాలనైనా పిల్లలను చూసి భరించవచ్చును.

తిరువెంగళం నెమ్మదిగాలేచి మంచంమీద కూర్చున్నాడు. ప్రక్కనే పడుకున్న భార్య మంచంకేసి చూశాడు. శాయమ్మ

గాఢంగా నిద్రపోతోంది. అమ్ములు తన చిన్న చేతిని తల్లి రొమ్ముమీదవేసి పాలు తాగుతోంది. ఆ పసిపిల్ల కూడా తల్లిని గట్టిగా కరచుకుని పడుకుంది.

ఆ మరుక్షణంలో అతనికేదో గుర్తుకు రాగా నవ్వుకున్నాడు సృష్టి విచిత్రంలో ఇది మరో విచిత్రం!

యువతి మాతృమూర్తి అయిన మరుక్షణంలో పిల్లలకు పాలివ్వడం! మరోసంగతి కూడా అతనికి స్ఫురించింది.

తండ్రికి కొడుకుమీద ప్రేముంటే, తల్లికి కూతురుమీద ప్రేమ వుంటుందట ఇప్పుడిది చూస్తుంటే నిజమేననిపిస్తోంది.

తిరువెంగళం ఇద్దరు పిల్లల్నీ మరోసారి తృప్తిగా చూసుకున్నాడు. ఏడేళ్ళ క్రితం పిల్లలకోసం ఎలా తపించిందీ కళ్ళముందు కదలసాగింది.

* * *

అప్పటికి పెళ్ళయి నాలుగేళ్ళు దాటింది. తిరువెంగళానికి సంతానం కలగలేదు. మొక్కని దేవుడూ లేడు! గూడెంలో వున్న వాళ్ళంతా చెవులు కొరుక్కున్నారు — నాలుగు సంవత్సరాలైనా ఇంకా పిల్లలు కలుగలేదని. అదేదో విచిత్రమైన విషయంగా చెప్పుకునే వారు.

పసిపిల్లలు తప్పటడుగులతో, వచ్చీరాని మాటలతో ముద్దుముద్దుగా పలుకుతుంటే శాయమ్మ ఒక్కోసారి ఆనందించేది కానీ, మరుక్షణంలోనే అంతులేని నిరుత్సాహంతో దిగులుపడి పోయేది. అప్పుడు! తనకు పిల్లలు కలగరా!

అప్పటే, తిరువెంగళం ఇవేవీ ఆలోచించే వాడు కాదు కొంచెం దూరదృష్టి గలవాడు గనుక పిల్లలుంటే ఎన్ని బాధలూ, ఎన్ని కష్టాలూ భరించాలో అనుకునేవాడు పిల్లలకు జ్వరమొచ్చినా, జబ్బుచేసినా, జలుబుచేసినా ఎన్నిబాధలు పడాలో ప్రత్యక్షంగా ఎదురింటి పిల్లలను చూస్తున్నాడు ఈ గూడెంలో మందులవసతి లేదు నాటు మందులతో సర్దుకుంటే సరేసరి, లేదా, పిల్లలే సరేసరి...రోజూ పట్నం తీసుకెళ్ళి మందిప్పించాలంటే మాటలతో సరిగాదు!

సరికాకపోయినా ఎంతమంది పిల్లలున్నా శాంతించని ఆడది స్త్రీ. అందుకే వారో చెప్పారు — 'పొంగుతుయుటున్న గంగానమ్మ చుట్టూ ప్రతిరోజూ తెల్లారా స్నానం చేసి ప్రదక్షిణంచేసి అక్కడున్న రాళ్లను మోసుకొస్తూ ఇంటిదగ్గర విడవాలని. అలా చేస్తే పిల్లలు పుడతారనీ.'

అందులో ఎంతవరకు మహత్యం వుందో తెలీదుగానీ శాయమ్మ చాలా నిష్టగా ఆచరించింది.

ప్రొద్దుటే చలిలో తెల్లారా స్నానంచేసి, ముఖానికి పసుపు రాసుకుని, కాళ్లకు పారాణి పెట్టుకుని మైలున్నరదూరం నడచివెళ్లేది గుడిగుట్టూ మూడుసార్లు ప్రదక్షిణాలు చేసి అక్కడున్న రాళ్లగుట్టలోంచి రాయిని తీసుకుని నెత్తిమీద పెట్టుకుని మళ్లా మైలున్నర నడచుకుంటూ వొచ్చేది గుడిసెకు.

ఇలా నియమం తప్పకుండా శాయమ్మ దాదాపు సంవత్సరం పూజలు చేసింది. ఆమె కోరిక నెరవేరింది.

ఇప్పుడు పూజలు చేయకుండానే శాయమ్మకు పిల్లలు పుడుతున్నారు.

* * *

తిరువెంగళం లేవడంతోనే హడావుడిగా సుత్తి తీసుకుని పనిలోకి వెళ్ళాడు ఇవేళ అతను చేయవలసిన పనులు చాలావున్నాయి. కొంచెం ప్రొద్దెక్కేంతవరకూ రాళ్లను పగలగొట్టాలి. ఆ తర్వాత గుడిసెకెళ్లి అన్నం వండాలి. ప్రసవించేంతవరకూ శాయమ్మకు ఇబ్బంది కలిగించకూడదు. పిల్లలకూ, భార్యకూ అన్నంపెట్టి తను తిని, కట్టెలు కొట్టుకుని తీసుకురావడానికి వెళ్లాలి ప్రొద్దువాలిపోతుండగా గుడిసెకి చేరాలి.

అందుచేత తిరువెంగళం కూర్చుని పని చేసుకుంటున్నాడు సూర్యుడు ఇప్పుడిప్పుడే ఆకాశపుమెట్లు ఎక్కుతున్నాడు. గాలి చల్లగా వీస్తోంది.

అతని పనికి అంతరాయం కలిగిస్తూ ఆ నిర్మానుష్యమైన రోడ్డుమీద కారుహారను వినిపించింది తిరువెంగళం తలెత్తి చూశాడు. ఆ కారు దరిదాపు అతన్నిదాటి వెళ్లిపోయింది వేగంగా మరికొన్ని నిముషాల్లో మరో కారు అంతకంటే వేగంగానూ పట్నం వేపుకు దూసుకుపోయింది ఒకగంటలోపునే లెక్కలేనన్ని కారులు అటూ ఇటూ హడావుడిగా తిరిగాయి. ఇప్పుడా ప్రదేశమంతా సందడిగా వుంది, కోలాహలంగా వుంది కొన్ని యుగాలు చైతన్యం లేకుండా వుండి ఇప్పుడు నిద్రమేల్కొన్నట్టుగా వుంది ఆ ప్రాంతమంతా.

తిరువెంగళం చేస్తున్న పని ఆపి చిత్రంగా ఆ కారులను, మనుష్యులనూ చూస్తూ కూర్చున్నాడు.

ఎండ తీవ్రత ఎక్కువైంది. గాలి వెచ్చగా వీస్తోంది తిరువెంగళం బండమీద నుంచి లేచి చెట్టునీడకింద కూర్చున్నాడు. ఇప్పుడతనికి హాయిగా వుంది చల్లగా వుంది.

కొద్దిసేపట్లో ఒక వ్యాను వచ్చి తిరువెంగళం కూర్చున్న దగ్గర ఆగింది. అందులోంచి పది పన్నెండుమంది మనుషులు హడావుడిగా దిగారు వారి చేతుల్లో ఏవేవో సామానుంది. ఇంకా కొంత సామాను క్రిందకు దింపుతున్నారు. తీగలూ, స్తంభాలూ ఇంకా ఏవేవో దిగుతున్నాయి.

## కారుణ్యమూర్తి

ద్వి 1 ఏడు కొండలపై ఎటుంటి నిద్రేవు?
తోడు నీడయులేక ఆవనారు దేవ

2 వెలగితివో ప్రేమ మీరంగ నీవు
తిరిగితివో పతి అలివేలుపై ప

3 మంగతి పిలిచేను, ఎటువున్నావు?
కలియుగ మహిమా యహో! కనుపించవేల?

4 దూరాన కోనలో దాగేవు నీవు
దారితెలియక నే తల్లడిల్లేను

5 నాడుకలత చెందినట్టి నీ మోము
నేడు ప్రకాశించె నీ భూమిపైన

6 పిన్నలు, పెద్దలు పూజించుచుండ
కనికరంబుగనీవు కరుణింపవయ్యా

7 వైకుంఠమన్నారు వెంకటాద్రయన
వెంకటేశ్వరుడవై వర్ధిల్లునికా—

8 కరుణ జూడింతుమా కారుణ్య
మూర్తి
వరమిచ్చి మముగావ వేగరావయ్యా

— మాడభూషి సంతానం

తిరువెంగళం కుతూహలంగా లేచి నుంచు న్నాడు ఆసక్తిగా వారిదగ్గరకెళ్లి అడిగాడు—

'బాబుగారూ! ఏంటిదంతా?'

'ఎల్లుండి రాజులొస్తున్నారు పట్నంలో కొన్ని రోజులు విశ్రాంతి తీసుకుంటారు. ఆ తర్వాత వారు ఒక రాత్రిపూట ఇక్కడ నుంచి వెళ్లిపోతారు.'

తిరువెంగళం ఈ మాట వినడంతోనే చాలా ఆనందపడ్డాడు రాజుగార్ల పేరు వినడమేగానీ ఇంతవరకు ఎప్పుడూ చూడ లేదు! ఇప్పుడు చూడవచ్చును.

'బాబూ! ఎల్లుండి ఎన్నిగంటలకొస్తా రండి?'

'మధ్యాహ్నం ఒంటి గంటకు!'

వారు చకచకా పనులు చేసుకుంటున్నారు ఆ ఎండలో. వారికి ఎండ అనిపించినా అనిపించనట్టు వుండాలి. అనుకున్న పని అనుకున్న ప్రకారంగా జరగాలి. అలా జరక్క పోతే పై అధికారులతో బండబూతులూ, తిట్లూ తప్పవు! చేతులూ, కాళ్లూ నొప్పి పెడుతూనే వున్నాయి. కష్టపడుతూనే వున్నారు. చెమట్లు కారుతూనే వున్నాయి. ఎండ తీక్షణ వుధృతంగానే వుంది. భోజనం వేళ మించిపోయినా వాళ్ళకు భోజనం ఇంకా రాలేదు. భోజనం తీసుకొచ్చే 'వ్యాను'కోసం ఆశగా చూస్తూ పని చేస్తూనేవున్నారు.

తిరువెంగళం వంటవేసే పల్లలకూ





భార్యకూ అన్నం పెట్టి తనూ తిన్నాడు. ఇవేళ అతనికి గొప్ప పండుగలా వుంది. పండుగలకల్లా గొప్ప పండుగలా వుంది. మన సంతా తేలికగా వుండి ఆనందంగా వుంది. ఈ పూటకింక ఏపనీ చేయ బుద్ధి కావడం లేదు. రాబోయే మా రాజుగారిని గురించి ఆలో చిస్తూ వుండిపోవాలనిపిస్తోంది!

తిరువెంగళం చెట్టుక్రింద మంచం వేసుకుని పడుకున్నాడు. ఎండ అతనిమీద పడుతున్నా చల్లగానే వుంది.

'మా రాజులొస్తున్నారు! వారు ఎక్కడో పెద్ద పట్నంలో పెద్ద ఇంటిలో వుంటా రట. ఇంటినిండా పని మనుషులుంటారట. చుట్టూ పోలీసోళ్లు కాపలా వుంటారట. ఎప్పుడూ రెండు మూడు కార్లు తిరగడానికి వుంటాయట. వారు ఎప్పుడోగానీ బయటకు రారట. చూడాలి ధర్మప్రభుల్ని!

* * *

ప్రొద్దు వాలిపోయింది. చీకటి రాబు తోంది. గూడెంలో వున్న మనుషులంతా ఒక చోటజేరి రాబోయే ప్రభువుల్ని గురించి, వారి వైభవాన్ని గురించీ ముచ్చటించు కుంటున్నారు. మాట్లాడుకుంటున్నవారంతా నిశ్శబ్దులయ్యారు.

ఆ ప్రాంతమంతా పట్టపగలైంది. ట్యూబ్‌లైట్లు దేదీప్యమానంగా వెలుగు తున్నాయి. ఎక్కడ చూసినా ఎటు చూసినా చీకటనేది కనిపించడం లేదు. ఆకాశాన్నుంచి

# మహారాజులొచ్చారు

చందమామను దింపి ఇక్కడ కూర్చోబెట్టి నట్టుగా వుంది.

పిల్లలూ, పెద్దలూ, ఆడవాళ్లు అంతా ఒకటే కేరింతలు. సంబరం, పరాచికాలూ.

దీపాల వెలుగులో తారురోడ్డు షేవింగ్ చేసుకున్న గడ్డంలా నున్నగా మెరిసిపోతోంది. లావైన సినిమా హీరోయిన్ మేకప్ చేసు కున్నట్టుగా చెట్లు ఠీవిగా నిలబడివున్నాయి.

అప్పటికి చాలా రాత్రయింది. గూడె మంతా నిద్రపోతోంది. తిరువెంగళంమాత్రం నిద్రపోలేదు. అతనికి నిద్ర రావడంలేదు. దీపాలకాంతి కళ్లల్లోకి చొరబడి నిద్రరాకుండా చేస్తోంది. కళ్లు మూసుకుంటుంటే తిరువెంగళానికి — రాబోయే మారాజులు అందంగా కనిపిస్తున్నారు. వారు ఎల్లుండి వస్తారు. వారు రాకముందే ఎన్నో వసతులు యేర్పడ్డాయి. కరెంటు పెట్టారు. బస్సులు తిరుగుతున్నాయి. వారు వచ్చిన తర్వాత ఇంకా ఎన్ని సౌకర్యాలు సమకూర్చ బడ తాయో!

అప్పుడతనికి తన చిన్నతనంలో వాళ్ల నాన్న చెప్పిన కథొకటి గుర్తుకొచ్చింది. ఈ కథ ఎప్పుడూ అతనికి గుర్తుకొస్తూనే వుంటుంది.

ప్రభువులు సాధారణంగా బయటకురారు. వారు పెద్ద పెద్ద భవనాల్లో, వుద్యాన వనంలో వుంటుంటారు. వారు ఏది కావా లన్నా బయటకు రాకుండానే అన్నీ సమ కూరేవి. ప్రతి పల్లె, ప్రతి పూరూ అన్నీ వారి ఏలుబడిలోనివే. వారు బయటకు రాకపోయినా ప్రజలకేం కావాలో తెలుసుకుని అన్ని సదుపాయాలూ చేసేవారు. అసలు ప్రభువులు ఎలా వుంటారో కూడా చాలా మందికి తెలిసేది కాదు. అయితే ఏం వారిమీద భక్తి అచంచలమైనది. ఎప్పుడైన వారు పరివారంతో బయటకొస్తే ప్రతిచోటా ఆగి ప్రజల కష్టసుఖాలు స్వయంగా తెలుసు కుని వారికి తగిన సహాయం చేస్తుండే వారు— ఇది తిరువెంగళానికి వాళ్ల నాన్న చెప్పిన కమ్మని కథ!

ఈ కమ్మని కథ వెనుక—సరైన తిండి లేక ప్రేవులు మాడిపోతున్న పేదల ఆశ, ఊపిరీ, నిరాశా, దేనికోసమో ఎదురు చూడడం దాగివుంది.

ఇప్పుడు మా రాజు లొస్తున్నారు. పల్లెనూ, గ్రామాన్నీ, పట్టణాన్నీ, దేశాన్నీ పాలించే రాజులొస్తున్నారు. వారు వస్తున్న దారిలో నుంచుని వారిని కలుసుకుని తనకు వచ్చిన భాషలో — ఇక్కడ ఈ గూడెంలో తాము అనుభవిస్తున్న బాధలు, వుండడానికి సరైన నీడలేక, తిండిలేక జబ్బుచేస్తే వైద్యసదుపాయం లేక పడుతున్న కష్టాలను విన్నవించాలని తిరువెంగళం ఆశపడు తున్నాడు.

అతని ఆశ నెరవేరి మేలుజరగాలని కోరుకుందాం!

* * *

రేపే మారాజులు వచ్చేది.

తిరువెంగళం చాలా సంతోషంగా నిద్ర లేచాడు. ఇవేళ పనంతా చకచకా చేసెయ్యా లనుకున్నాడు. పూర్తిగా తెల్లవారకముందు నుంచే కార్లూ, లారీలూ, జీపులూ తిరగ సాగాయి.

ఎవరెవరో వస్తున్నారు. తిరుగు తున్నారు. చూస్తున్నారు. వెళ్లిపోతున్నారు. ఏవిటేవిటో ఇంగ్లీషు మాట్లాడుకుంటు న్నారు. వచ్చిన అధికారులు వెళ్లిన ఒక గంటకు ఒక లారీనిండా పోలీసులు లాటీ లతో, తుపాకులతో దిగారు.

వారు పిలిస్తే తిరువెంగళం నేనున్నానని ఆసి వెళ్లాడు.

'ఏరా! ఆరోడ్డు ప్రక్కనున్న గుడిసెలు



మీవేనా!'

'చిత్తమండి'

'వెంటనే పీకేసి ఇంకోచోట వేసుకోండి. పొండి'

తిరువెంగళం ఏం విన్నాడో అర్థంకాని వాడిలా పిచ్చిగా వాళ్లను చూస్తుండి పోయాడు.

'నీకేరా చెప్పేది! మీవాళ్ళందరికీ చెప్పి పీకించెయ్ ఇక్కడ ఒక్క గుడిసెకూడా వుండడానికి వీల్లేదు. వచ్చే ప్రభువులకి రోడ్డు పక్క ఈ గుడిసెలు అసహ్యంగా కనిపించకూడదు, తెలిసిందా? ఊ వెళ్ళు'

'అలా అంటే ఎలా బాబూగారూ. మరి మేం యాడుండగ?'

'పిచ్చి రెండు తన్ని అపతలకు ఈడ్వండి ఎదురు సమాధానం చెప్తావురా రాస్కెల్' బూటుకాలితో బలమైన దెబ్బ.

ఆ దెబ్బకు తిరువెంగళం దూరంగా వెళ్లి పడ్డాడు కళ్ళు తిరిగి కన్నీళ్లు జారాయి లేవాలని ప్రయత్నించాడు, లేవలేకపోయాడు శక్తినంతా వుపయోగించి లేచాడు తూలి పడబోయాడు. అతను ముందుకు కదిలి వెళ్లిపోయేంతంతలోనే, అక్కడున్న గుడిసె లన్నీ నేలమట్టమయ్యాయి!

తిరువెంగళంతోపాటుగా గూడెంలోవున్న వాళ్ళంతా నిరాశ్రయులయ్యారు. అరాత్రంతా చెట్ల క్రిందనే పడుకున్నారు అయినా, వాళ్లకు బాధ అనిపించలేదు

వచ్చే మహారాజులు తమ దుస్థితిని చూసి తమకింత సహాయం చేస్తారనే ఆశ వాళ్ళ గుండెల్లో వెలుగుతోంది.

ఆరోజు ఎప్పుడూ కాయనంత తీక్షణంగా ఎండ కాస్తోంది. సూర్యుడు నిప్పులు కక్కుతున్నట్టుగా వుంది. చెట్ల ఆకులు వాడిపోయాయి తాటాకు భగ్గున మండిపోయేంత ఎండ కాస్తోంది! వడగాలి తివ్వున వీస్తోంది. చెవుల్లో హోరుగా వుంది.

ఆ ఎండలో చెప్పుల్లేక రోడ్డుమీద తిరువెంగళం అతని భార్యా, గూడెంలోవున్న జనమంతా వొచ్చే మహారాజుకోసం ఎదురు చూస్తున్నారు; తిరువెంగళం కొడుకు నెత్తుకున్నాడు భార్య పిల్లనెత్తుకొన్నది. ఎండ చురచురా కాలుతోంది నెమట్లు కారుతున్నాయి. అయినా వాళ్లు అక్కడనుంచి కదలలేదు.

చిన్నకార్లూ, జీపులూ వెడుతున్నాయి.

# పుట్టుకతోనే ఉండేది—



ధర్మపథం. ఋబసు వెంకటరమణయ్య

కవిత్వం గాని, సంగీతం గాని సహజంగా అబ్బవలసినవే గాని, నేర్చుకునేవి కావు. నేర్చుకునే వాటికీ సహజమైనవాటికీ ఎంతో వ్యత్యాసం కనబడుతుంది. 'అందువల్లనే— కోట్లకొద్దీ ఉన్న జనంలో ఏ కొద్దిమందో గొప్ప గాయకులుగానూ, మహా కవులుగానూ పేరు పొందుతారు.

సహజాలంటే ఏమిటి? పుట్టుకతోనే వచ్చిన వన్నమాట.

పుట్టుకతోనే కాకుండా ప్రాణి తల్లి గర్భంలో ఉన్నప్పుడే బ్రహ్మ నిర్ణయించినవి కొన్ని ఉంటాయి. వాటినే బ్రహ్మవ్రాత అంటారు. బ్రహ్మనిర్ణయానికి తిరుగు ఉండదు— 'మదుటన్ వ్రాసిన వ్రాత మారగలదే మారేండ్లు చింతించినన్' అనే పెద్దల మాట దీని ననుసరించే ఏర్పడినది.

ఆ నిర్ణీతమైనవి ఏవి?

'ఆయుః కర్మ చ విత్తం చ
విద్యా నిధనమేవ చ,
పంచైతాని విలిఖ్యంతే
గర్భస్థస్యైవ దేహినః'

జీవికి ఎంత ఆయుర్దాయమున్నదో, అతడు ఈజన్మలో పుణ్యకార్యాలే చేసాడో, లేక చెడ్డపనులు చేసి నలుగురినోళ్ళలోను పడతాడో, ధనవంతుడౌతాడో—లేక దారిద్ర్యంతో బాధపడుతూ ఉంటాడో, విద్యావంతుడవుతాడో లేక విద్యావిహీనుడవుతాడో, అతడు కొంతకాలం రోగంతో తీసుకుని మరణిస్తాడో లేక అతనికి మరణం హఠాత్తుగా సంభవిస్తుందో మొదట ఎవ్వరూ చెప్పలేరు. వాటిని తెలుసుకోడానికి జాతకం వ్రాయిస్తారు. కాని, జాతకంలో ఉన్నప్రకారం జరగడం అరుదు. కాని బ్రహ్మదేవుడు మాత్రం మానవుడు తల్లిగర్భంలో ఉన్న సమయంలోనే అసలైన జాతకాన్ని వేసి ఉంచుతాడు. ఆ జాతకం బ్రహ్మకే గాని మరెవ్వరికీ తెలియదు.

ఏమంటే-వాటినన్నిటినీ మొట్టమొదట నిర్ణయించి, ఆ తర్వాతనే అతడే జన్మను ప్రసాదిస్తాడు.

సరి అయిదున్నా మన ప్రయత్నం వల్ల సాధ్యపడేవి కానేకావు బ్రహ్మ నిర్ణయించినదానికి విరుద్ధంగా నడవడమన్నా సాధ్యం కాదు.

అందువల్లనే 'త్రిమూర్తులు కూడా లలాట లిఖితాన్ని మార్చలేరు' అనే లోకోక్తి ఏర్పడింది.

మొదట నిర్ణయించినదాన్ని మార్చడానికి బ్రహ్మకున్నా సాధ్యం కాదన్నమాట. ●

# మారాజులొచ్చారు

అందులో కూర్చున్న వాళ్లంతా దర్జాగా, దిగులన్నది తెలియని గొప్పవ్యక్తుల్లావున్నారు.

నిముషాలూ, గంటలూ గడుస్తున్నాయి. ఆర్భాటం ఎక్కువవుతోంది. మారాజులు వచ్చేస్తున్నారొచ్చేస్తున్నారు —అంటున్నారు. కానీ, వారు రావడంలేదు!

తిరువెంగళానికి ఆకలవుతోంది. పిల్లలకు ఆకలవుతోంది. ప్రేవులు మెలితిరిగిపోతున్నాయి. కడుపు లోతుకుపోయి వెన్ను కంటుకుపోయింది. వాళ్లు ఇంకా వంటచేసుకోలేదు. వంట చేసుకుంటున్న సమయంలో మారాజులు ఎక్కడ వెళ్లిపోతారోనన్న బెంగతో చేసుకోలేదు!

కారు హారన్ వినిపించింది. ఆకారు చాలా వేగంగా ముందుకు వెళ్లిపోయింది. ఆతర్వాత మరో లారీ. ఆ లారీనిండా పోలీసులున్నారు.

ఆతర్వాత ఒక మోటారుసైకిల్. మోటరుసైకిల్ మీదున్న మనిషి ఠీవిగా కూర్చుని దర్జాగా వెళ్లిపోతున్నాడు.

ఇంకా కొన్ని నిముషాల్లో మారాజులు వస్తున్నారన్నారు. అంతా రెప్పవేయకుండా ఆశగా చూస్తున్నారు.

'అదిగో ఆకారే. ఆ వొచ్చేకారులోనే మారాజులున్నారు!' ఉత్సాహంగా తిరువెంగళం రెండడుగులు ముందుకు వేశాడు. ఆత్రుతగా చూస్తున్నాడు.

ఆ కారు వొచ్చేసింది. అదికారులా లేదు. పుష్పక విమానంలావుంది. గొప్ప ఖరీదు గనుక గొప్ప కళగావుంది. అద్దంలా మెరిసిపోతోంది. ముద్దుపెట్టుకోవాలన్నంతగా ముచ్చటగా వుంది. లోపలకు ఎండతగలకుండా కూలింగ్ డోర్స్ అమర్చబడి వున్నాయి. మారాజుల కారు మెత్తగా, వేగంగా, సుఖంగా హాయిగా, శబ్దంలేకుండా వెళ్లిపోయింది తిరువెంగళాన్ని దాటి!

మారాజులను చూడాలనే తిరువెంగళం ఆశ తీరలేదు! అతను తనిద్దరి పిల్లలను దగ్గరకు తీసుకున్నాడు. ఎండ కాలుతోంది. కాళ్లు బొబ్బలెక్కుతున్నాయి. శరీరమంతా తడిసిపోయింది. ముఖమంతా మాడిపోయింది. ఏమీ చేతకానివాడిలా తిరువెంగళం అచేతనంగా నిలబడిపోయాడు భార్య శాయమ్మకు కళ్లు తిరుగుతున్నాయి. స్పృహతప్పి పడిపోయేస్థితిలోవుంది.

దూరాన పీకేసిన గుడిసెలు కనిపిస్తున్నాయి. వాసాలు విరిగిపోయాయి. తాటాకులు తుంపులైపోయాయి:

ఇప్పుడు తను ఎక్కడుండాలి?

అవును! ఇప్పుడతను ఎక్కడుండాలి?

ఎండలో మాడుతూ, వానలో తడుస్తూ, చలిలో వణకుతూ చెట్టుక్రింద బ్రతకాలి.

అప్రయత్నంగా అతని కళ్లల్లో కన్నీళ్లు నిలిచాయి. ఆ కన్నీళ్ల తెరలమధ్య మారాజులకారు మసగ్గా కనిపిస్తోంది.

గుండెలు బద్దలవుతుండగా, ఏకధారగా కన్నీళ్లు కారుతుండగా, ఆఎండలో తనిద్దరి పిల్లల్నీ పొట్టకుకరచుకుని పిచ్చిగాచూస్తూ నించునున్నాడు తిరువెంగళం! ●

# సినిమాలూ - గినిమాలూ


మీ మాట ఎప్పుడు కాదన్నాం? మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి!
అమ్మమాట


నన్ను ఎన్నుకున్న ప్రజలు ఉరిగా పెట్టినా సరే నే రాజీనామా చేయనంతే!
ప్రజా నాయకుడు


ప్రత్యేక రాష్ట్రం కావాలి!
విచిత్ర బంధం


ఇప్పుడు మనం విద్యార్థులు చెప్పినట్లు వినాలి - లేపోతే రేపు ఎన్నికల్లో మనకు పోటీగా నిలబడి గెలుస్తారు!
కాలం మారింది


నా పేరు 'సమైక్యరాణి'!
శభాష్ బేబి


శాంతినిలయం (కర్ఫ్యూ)

## డిటెక్టివ్ సీరియల్




### జరిగిన కథ

రామం, రంగనాథం ఇద్దరూ జంటకవుల్లా ఒక డిటెక్టివ్ నవల రాయాలనుకున్నారు. రాయటానికి ఒక స్థలం కావాలి గనక 'హోటెల్ వసిష్ఠ్'లో ఒక గది అద్దెకి తీసుకున్నారు. అక్కడ నవల రాయడం ఆరంభించారు. పాత్రల పేర్లన్నీ హోటల్లో, పనిచేసేవారి పేర్లే పెట్టేశారు. వారు రాస్తున్నట్టుగా— వకుళాదేవి హత్య నిజంగా జరిగిపోయింది. ఎస్సయ్ భోలానాథ్ పరిశోధనకి ఉపక్రమించాడు. రాస్తున్నది యథాతథంగా జరగటంతో ఇద్దరూ భయపడిపోయారు.

## 4

ఈ కొత్త కథ ఎట్లా ఆరంభించాలా అని ఆలోచిస్తుంటే టెలిఫోను మ్రోగింది.

'ఈ ఫోను ఎక్కణ్ణించా!' అని యిద్దరూ ఆశ్చర్యపోయారు. తర్వాత ఫోను ఎత్తగానే రామానికి బాబాయి గొంతే వినిపించింది.

'హలో- ఎవరూ? రామమేనా?'

రామం 'ఔనే' అన్నాడు. తర్వాత 'మీరెవరు' అన్నాడు.

'నేను! స్వరం తెలియటంలే, నీ బాబాయిని.'

'ఆ!—అంటే—జంగ్ బహద్దూర్ వెంగళరాయుడు!'

'ఆ! అదే; నేను రాత్రే యిక్కడికి వచ్చాను. అప్పట్నుంచి తెగగాలిస్తున్నాను— అది సరేనోయ్—వెధవా; నిన్ను చదువుకోరా అని యిక్కడ వుంచితే— నువ్వు హోటల్లో చేరి డిటెక్టివ్ నవలలు రాస్తున్నావా? మీ పనికుర్రవాడిప్పుడే చెప్తున్నాడు నీకేమన్నా బుద్ధివుందా అసలు? ... ఆ హోటల్లో ఏ రూమ్‌లో వున్నావ్?'

'రూం నెంబరు పదమూడు.'

'ఆ! పదమూడు రూమ్‌లోనా! ఏడిసినట్లుంది నేను రాత్రి ఇరవై ఆరో రూమ్‌లో భీమశంకరం గారితో మాట్లాడుతున్నాను.'

'ఆ!' అన్నాడు రామం. చేతిలోవున్న ఫోను చేతిలోంచి జారిపోయింది. రంగనాథం కంగారుపడి ఫోనుతీసి స్టాండుమీద పెట్టేశాడు.

'ఏమిట్రా యిది.'

'హత్యచేసింది బాబాయే అయుందిరా!'

'ఏం? ఏం?'

'బాబాయి రాత్రి ఈ వూళ్ళో ఈ హోటల్లోనే వున్నాట్ట!'

'నిజంగా?'

'నిజంగా యేమిటి — బాబాయే చెప్తున్నాడు. ఇంకా మాట్లాడితే—'నేనే హత్య చేశానని' ఒప్పుకుంటాడేమోనని ఫోన్ పెట్టేశాను. ఇంకా నయమే! రాసేశాం కాదు! కాగితంమీద పెట్టేస్తే — అదే నిజమయిపోయేది!

'అరరే! బలే ఛాన్సు పోయిందే! బాబాయే హంతకుడైతే ఆయన్ను కోర్టుకి బోను ఎక్కిస్తే — ఆయన్ని — ప్లీడర్లు నానా ప్రశ్నలూ అడుగుతుంటే... ఆయనకు కోపం వచ్చి అందర్నీ తిడుతూవుంటే — తర్వాత జైల్లో పెట్టి ఆయనకున్న పెద్ద పెద్ద మీసాలు గొరిగించేస్తే..'

'ఒరే, ఒరే, ఎంత చెడ్డా నా బాబాయిరా ఆయనా!'

'అయితే ఏమోయ్! కథ ఎంత రక్తి కడుతుందే...'

'వద్దురా, వద్దు. ఇప్పుడేదో కొత్త ట్విస్ట్ ఆలోచిద్దాం'

ఇద్దరు మిత్రులు మళ్ళా కొత్త ట్విస్ట్ కోసం తలలు బాదుకోవటం ఆరంభించారు. కాని ట్విస్ట్‌లు అంత తేలిగ్గా రావు. హత్యలయితే తేలిగ్గానే జరపగలిగారుగాని — హంతకుణ్ణిమాత్రం తేలిగ్గా నిర్ణయించలేకపోతున్నారు. ఎవర్ని హంతకుణ్ణి చేద్దామన్నా

ఏదో ఒక యిబ్బంది వస్తోంది. అందుకని రంగనాథం వేరేవిధంగా ఆలోచించాడు.

'ఒరే! ఒకగొప్ప అయిడియా' అన్నాడు.

'ఏమిటది ?'

'చాలా గొప్పదిలే! నిజానికింత గొప్ప అయిడియా నీకూ యింతవరకూ తట్టి వుండదు!'

'ఏమిటది. త్వరగా చెప్పరాదూ ?'

'మనం ఈ కథలో వకుళాదేవిని పాత్రగా తీసుకున్నాం, అవునా ?'

'అవును.'

'ఇప్పుడు ఒకపని చేస్తేసరి. నేను చెప్తాను. కథ నువ్వు రాసుకో, కారులో వెళ్ళింది వకుళాదేవి కాదు. వకుళాదేవి హోటల్ బాత్‌రూంలలో — ఒకదానిలో— మత్తుమందు తిని పడి వుంది. విశ్వంయ్ భోలానాథ్ వెళ్ళి ఒక బాత్‌రూం తలుపు తెరిచాడు. వకుళాదేవి పూర్తిగా మగతలో అతని పాదాలమీద పడిపోయింది.

'మరి కారులో చనిపోయిన దెవరూ ?'

'నువ్వు మధ్యలో అడ్డురాకు. ఆ అమ్మాయి ఎవరో అద్దెకు తీసుకువచ్చిన సినిమా నటి'—

'కాని ఆ అమ్మాయికి—మన తాళం చెవులగుత్తి ఎక్కడ దొరికింది.'

'అబ్బబ్బ. నువ్వెట్లా కుంటిప్రశ్న లెయ్యకు. నేనింత బుర్ర పగలగొట్టుకుని, ఇంత చక్కని ట్విస్ట్ చెపితే—విని గబగబా రాసెయ్యక, వెధవ ప్రశ్న వేస్తావేం ? అబ్బే! ఇట్లా నన్ను నిరుత్సాహపరిస్తే మనం ఒకపేజీ ముందుకెళ్ళలేం.'

'సరే' లెమ్మని—రామం కొత్త ట్విస్ట్‌లో బాగోగులు సావధానంగా ఆలోచించటం మొదలుపెట్టాడు. ఈలోగా సిగరెట్టు పెట్టెకోసం రంగనాథం దేవుళ్లాట్టం మొదలుపెట్టాడు. సిగరెట్టుపెట్టె టేబుల్‌మీద లేదు. పక్కమీద లేదు. నేలమీద ఎక్కడాలేదు. చివరకు జేబులు తడుముకుంటుంటే—అక్కడ—

'ఒరేయ్' అన్నాడు — రంగనాథం నిలువెల్లా ఆశ్చర్యంతో.

'మళ్ళీ ఏమొచ్చింది ?'

'ఆ తాళం చెవులూ...?!'

'ఆ. తాళం చెవులూ ?'

'అదే; మనకారు తాళం చెవులు—



నా జేబులోనే వున్నాయి.' అంటూ తాళం చెవులు బయటకు తీశాడు రంగనాథం.

'మరి! ఆ ఇనస్పెక్టరు దగ్గరున్నవి?'

'అవ్వి మనవి గావు. తాళాలూ రింగూ మనవి లాగే వున్నాయి. కాని కావు. నేనే సరిగ్గా వాటిని గుర్తుపట్టలేదు లాగుంది.'

'ఆ!' అన్నాడు రామం.

అతనింకా ఆశ్చర్యం లోంచి తేరుకోనేలేదు. ఫజుల్ సాహెబ్ లోపలకొచ్చాడు.

'విన్నారా, విన్నారా వకుళాదేవి బ్రతికే వుంది—బాత్ రూంలో' అన్నాడు.

రంగనాథం పూర్తిగా ఖంగారు పడిపోయాడు.

'బాత్‌రూమ్ బతికి వుండటం ఏమిటండీ? సరిగ్గా చెప్పండి.' అన్నాడు.

'బ్రతికి వున్నది బాత్‌రూం కాదండీ, వకుళాదేవి! వకుళాదేవే బ్రతికివుంది. ఎస్. ఐ. గారు బాత్‌రూంలోకి వెళ్లటానికి తలుపు తెరిచారు. 'ధన్' మని కాళ్లమీద పడింది వకుళాదేవి.'

'మరి కారులో హత్య చేయబడిన ఆ పిల్ల ఎవరూ?'

'అదా ఆ భీమశంకరంగారి స్నేహితుట్ట ఎవరో! ఆయనకు గెస్ట్‌గా వచ్చాడు. ఆయన వెంట పెట్టుకు వచ్చాడీపిల్లను.

మొదట్లో ఆ దీక్షితులుగారు కూడా శవాన్ని చూసి వకుళాదేవే ననుకున్నాడు. శవానికున్న చీరా జాకెట్టూ వకుళాదేవి కట్టుకు తిరిగినవే. పోలికలు వేరేగానీ— ఇద్దరి స్టైలూ ఒక్కటే. పైగా ఆ కళేబరం గుర్తుపట్టలేనంతగా మారిపోయింది.'

రంగనాథం తనలో తను, తన కుర్చీలో కూర్చుని నవ్వుకుంటున్నాడు బిగ్గరగా. అతని నవ్వు విని ఫజుల్ సాహెబ్‌కు మరింత ఆశ్చర్యమేసింది.

'ఏమిటి; రంగనాథంగారూ, నవ్వుతారెందుకూ' అంటూ దగ్గరకు వచ్చాడు.

'మీరాశ్చర్యపోతారెందుకూ?' అంటూ మరింత నవ్వాడు రంగనాథం.

'మీరూ ఆశ్చర్య పోవాల్సిందే. పోక తప్పదు. వకుళాదేవే ఆ అమ్మాయి అనుకున్నాంగాని — వేరే అమ్మాయి అనుకున్నామా;'

'నే ననుకున్నాను. ఇప్పుడే మా రామంతో చెప్పాను గూడా, ఏరా? చెప్పలే?

# ఖబడ్దార్ - ఖూనీకోర్

'చెప్పాన్ గానీ—'

'కానీలు కట్టిపెట్టవోయ్. వకుళాదేవి బ్రతికేవుందని చెప్పాను. చచ్చిన అమ్మాయి వేరే అమ్మాయని చెప్పాను. మీ బాబాయి రాత్రి యిక్కడికి వచ్చాడని చెప్పాను.'

'అవును; చెప్పావు' అన్నాడు రామం దిగులుగా.

ఫజుల్ సాహెబ్‌కు లోలోపల ఏదో గుబులు బయలు దేరినట్టుంది.

'సాబ్; సాబ్; మీకా హంతకుడెవరో తెలిస్తే చెప్పండిసాబ్. ఎందుకొచ్చినగోల. ఆ ఎస్. ఐ. హోటల్‌ని తిరగేసి బోర్లేసి పరీక్ష చేస్తున్నాడు. చెప్పండి సాబ్. తెలిసి మమ్మల్నందర్నీ ఎందుకు చంపుతారు?'

'నాకు తెలుసు. కాని చెప్పను.'

'అరే!'

'అవునండీ. సాయిబ్బుగారూ; నాకు తెలుసు. కాని చెప్పను. ఓః, సారీ—మీరు సాయిబ్బుకాదు గదూ? సాహెబ్‌గారూ; కాదురా? 'హా' కొట్టుమిస్టే 'హా'.

'దాని దుంప తెగిరి. ఏదో ఒకటి లెద్దురూ. 'హా' కి గుడ్ — ఏత్యమో! వ్రటమిటి కామంటే సరి. కాని మీకు హంతకుడెవరో తెలిస్తే చెప్పండి సాబ్. మిమ్మల్ని బ్రతిమాలుకుంటాను.'

'చెప్పనుగాక చెప్పను. చెప్తే సస్పెన్సు పోతుంది. ఇంకా పదిహేను పేజీలన్నా నడవలేదు నవల.'

ఫజుల్ సాహెబ్ గారికి అకస్మాత్తుగా ఏదో అనుమానం వచ్చింది. వెంటనే బ్రతిమాలటం ఆపేశాడు. ఒక్కసారి టోపీతీసి తల గోక్కున్నాడు. మరోసారి పిల్లిగడ్డాన్ని నలుపుకున్నాడు. 'సరేలెండి సాబ్. దయవుంచండి. వస్తా' అని వెళ్ళిపోతూ తలుపు తెరిచాడు. అతని కళ్ళెదట ఒక రూంబోయ్ — సులేమాన్ — నుంచునివుండి కనిపించాడు.

'అరే; సులేమాన్; సాబ్‌కు ఏంకావాలో బాగా కనుక్కో' అంటూ చెప్పి ఫజుల్ సాహెబ్ వెళ్ళిపోయాడు.

ఆ వెళ్ళటం వెళ్ళటం సరాసరి ఆఫీస్ గదిలోకి వెళ్ళాడు ఫజుల్ సాహెబ్. అక్కడ కాగితాలన్నీ తిరగేసి — ఆఖరికి రంగనాథం ఆర్డరిస్తే వ్రాసుకున్న 'మెనూ' కాగితం బయటకు తీశాడు. వెనక్కు తిప్పిచూస్తే— చక్కగా అక్కడ వ్రాసి వుంది.

'అంతలో వెనకనుంచి ఒక అట్టహాసం లేచింది. ఫ్లాష్‌లైట్‌లో వకుళాదేవికి ఒక ముసుగు మనిషి కనిపించాడు. ఆమె కెవ్వున అరిచింది. అంతలో!'...!

అంతా చదివి ఫజుల్ సాహెబ్ గుండెల మీద చెయ్యి వేసుకున్నాడు. అంతటితో వూరుకోలేదు. పక్కనున్న గుమాస్తాన్నీ, తక్కిన పరిచారకులనీ దగ్గరకు పిలిచాడు. రూం నంబరు పదమూడులో వున్నదెవరో తెలుసా?

పెద్ద అపరాధ పరిశోధ శిఖామణులు; గొప్ప పత్తేదార్లు. దద్దమ్మల్లాగా. జాగ్రత్తగా వారిని కనిపెట్టి వుండండి.' అని పేరుపేరునా వారిని హెచ్చరించాడు. అంతటితోనూ వూరుకోలేదు. గబగబా ఎస్. ఐ. భోలానాథ్ దగ్గరకు వెళ్లాడు చేతిలో కాగితంతో సహా.

ఆ పరిచారకులూ వూరుకోలేదు. వాళ్ళ మరింత తెలివితేటలు ఈ దద్దమ్మల మొహాన పోసి చిత్రాతి చిత్రవర్ణాలతో చిత్రించి ప్రచారం చేశారు. గంటసేపట్లో ఎవరిగదిలో వాళ్ళు—ఎవరు విన్నది వాళ్ళు—రామం రంగనాథాల్ని గురించే చర్చిస్తున్నారు.

అంతసేపూ రామం వూరుకోలేదు; రంగనాథం వూరుకోలేదు. ఇద్దరూ తలలు బాదుకుంటున్నారు. 'నోటికి వచ్చినట్లల్లా వాగావ్! ఇప్పుడు చూడూ; కొంపమీది కొచ్చింది. హంతకుడెవరో నీకు తెలుసన్నావ్. ఆ భోలానాథ్ వచ్చి నువ్వాపేరు కక్కేదాకా వదలి పెట్టడు.'

'పోనీ కక్కుతానూ—అంతగా అయితే.'

'కక్కాల్సింది పొద్దున్న తిన్న యిడ్లీ కాదు. హంతకుడి పేరు.'

'అది నాకేం తెల్సు!'

'తెలుసన్నావ్‌గా యిందాకా. ఇప్పుడు తెలియదంటే వాళ్ళు నమ్మరు. పైగా తెలిసిన ఇంఫర్మేషన్ దాచి పెడుతున్నావ్ అని ఎరెస్టు చేసినా చెయ్యవచ్చు.'

'అరెస్టా'

'ఆ! ఆ ఇనస్పెక్టర్ మూడ్ బాగుండక పోతే మనిద్దర్నీ అరెస్టు చేస్తాడు. మూడ్ బాగుంటే నిన్నొకణ్ణన్నా తప్పదు.'

'నువ్వూ స్నేహంగా రాకపోతే ఎళ్ళాలా ఒంటరిగా—జైల్లో!'

# శుభ్రమైన బట్టలను ధరించే
# రెండు కోట్లకు పైగా ప్రజలు
# 501 సబ్బును మాత్రమే
# ఉపయోగిస్తున్నారు.

- వారికి తెలుసు. 501 సబ్బుతో ఉతికిన బట్టలు శుభ్రంగా, కాంతివంతంగా ఉంటాయని.
- 501 సబ్బుతో ఎక్కువ బట్టలు ఉతకవచ్చు మరియు వాటిని రాతిమీదవేసి కొట్టవలసిన పనిలేదు.
- 501 సబ్బు మిగతా సబ్బులకంటే ఎక్కువ రోజులు వస్తుంది.




కోట్లకొలది ప్రజలకు పసందైన
సబ్బును మీరూ వాడండి

BENSON-4648 TEL

'చేసుకున్నవారికి చేసుకున్నంత. అనుభవించు.'

అంతలో గదిబయట బూట్లచప్పుడు వినిపించింది.

'అదిగో ఎస్. అయ్. భోలానాథ్ అడుగుల చప్పుడే అది. వచ్చాడు.'

'నన్ను అరెస్టు చెయ్యటానికే !!'

ఎస్. అయ్. భోలానాథ్ తలుపు కొట్టాడు. 'మే అయ్ కమిన్ ప్లీజ్ ?' అని అడగలేదు. సరాసరి లోపలికి వచ్చాడు. రాంగానే పోలీసు సాల్యూట్ చేశాడు.

రామం 'ఇదేమిటా' అని ఆశ్చర్యపోతూ వున్నాడు. కాని రంగనాథం నిజమ్మైన పెద్దమనిషి. గనక — పెద్దమనుష్యులు సాల్యూట్‌కు ప్రతిగా సాల్యూట్ చెయ్యాలి గనక—తకాలున తనూ ఎస్. అయ్. లాగా సాల్యూట్ చేశాడు. దాంతో ఎస్. అయ్. భోలానాథ్ 'ఫజుల్‌సాహెబ్ అనుమానం నిజమే' ననుకున్నాడు. నిజంగా రంగనాథం ఎవరో పెద్దపోలీసు ఆఫీసరేననుకున్నాడు.

'క్షమించండి సార్, నేనింకా భోజనం కూడా చెయ్యలేదివ్వాళ. వెధవది; డ్యూటీలో వుంటే అంతేనండి. ఒక్కోసారి రోజులకు రోజులు సరిగ్గా తిండి వుండదు. అధమం నిద్రవుండదు. పోనీ యింకా కష్టపడి, పనిచేస్తే—ప్రమోషన్ సంగతి దేముడెరుగు—మెప్పుకూడా వుండదు. ఈ కేసు సరిగ్గా చేస్తే ప్రమోషన్ వస్తుందనే అనుకుంటున్నాను. ఏదో మీ సహాయం వుంటే—అదే—దేవుడి దయ వుంటే...'

అని ఆగి ఎస్. అయ్. భోలానాథ్ వూపిరి తీసుకున్నాడు. 'ఇప్పుడే భీమశంకరం గారి దగ్గర స్టేట్‌మెంట్ తీసుకు వచ్చాను.



## ఖబడ్దార్—ఖూనీకోర్

రాత్రి 8½ కి ఆయనతో మాట్లాడటానికి ఓ స్నేహితుడు వచ్చాట్ట. ఆయన చాలా పెద్దవాట్ట—లావుగా పొడుగ్గా వుంటాట్ట. పెద్ద మీసాలుంటాయట. పేరు జంగ్ బహాద్దర్ వెంగళరాయుట్ట! ఆ జంగ్ బహద్దూర్‌గారే యీ అమ్మాయిని తీసుకు వచ్చాట్ట. ఆ భీమశంకరం గారితో.. వేరే గదిలో కూర్చున్నార్ట, ఇద్దరూ ఆ అమ్మాయి పెళ్ళి విషయాలేవో మాట్లాడారట. తర్వాత 10 గంటలకు భీమశంకరం గారు తన గదికి వెళ్ళాట్ట. భీమశంకరం గారి భార్య మోహనాంగికి ఎందుకో ఈ అమ్మాయిమీద అనుమానం వచ్చిందట. మీ యిద్దరూ ఆ పిల్లతో ఆగదిలో ఏంచేస్తున్నారని దెబ్బలాడిందట. కాదు ఆ పిల్ల జంగుగారి కూతురని ఎంతచెప్పినా వినలేదుట. ఆఖరికి ఆయన పరాయిపిల్లతో మాట్లాడినందుకు శిక్షగా గోడకుర్చీ వెయ్యమన్నదట. ఆయన గోడకుర్చీ వేసేదాకా వూరుకోలేదట. ఆయన గోడకుర్చీ వేసిన తర్వాత మరో నిమిషం గదిలో ఆమె వుండలేదట.

మరి ఆ గంట సేపూ ఆమెగారు ఎక్కడ వుందో ఎవ్వరికీ తెలియదు.

ఆ గంటలోనే దోవలో ఆ అమ్మాయి హత్య జరిగింది. ఇల్లా మన దుంపతెగింది.

ఒక వేళేమన్నా — ఈ మోహనాంగే హత్య చేసిందా! అహహా; మీ అభిప్రాయం కూడా తెల్సుకుందామని అడుగుతున్నాను. అంతే, అంతకంటే మరేం లేదు.'

రామం మాట్లాడకుండా వూరుకున్నాడు.

రంగనాథమే ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఎస్. అయ్. భోలానాథ్ చెప్పుకుపోతూనే వున్నాడు.

'ఆ మోహనాంగి నా సమయంలో నువ్వెక్కడ వున్నావని ఎంత గుచ్చిగుచ్చి అడిగినా జవాబు చెప్పటంలేదు. దాన్నిబట్టి చూస్తే ఆమె హత్య చేసిందని అనుమానించవలసి వస్తోంది. ఏమంటారూ ?'

'అల్లాగే కనిపిస్తోంది' అన్నాడు రామం.

'లేదు' అన్నాడు రంగనాథం. పైగా 'అది అసంభవం. కేవలం మీ వూహ—ఆమె హత్య చెయ్యటమన్నది కలలోనిమాట. దానికి ఆధారమేమీ లేదు,' అనికూడా అన్నాడు.

'ఆమె హత్య చేయలేదని గట్టిగా చెప్పగలవా నువ్వు!' అని అడిగాడు రామం.

'ఓ! చెప్పగలను. ఆ మోహనాంగి రెండు పిప్పళ్ళబస్తా అంతలావు. నా కారు చిన్నది. నా కారులో మోహనాంగి పట్టదు. ఒకవేళ మనం బలవంతానా కుక్కినా నా కారు నడవదు.

మాటలన్నీ విని భోలానాథ్ తెల్లబోయాడు.

'నిజమే సార్. నేనీ సంగతి ఆలోచించలేదు. నాకు ప్రపంచజ్ఞానం తక్కువేనని తేలిపోయింది. మరి హత్య ఎవరు చేశారో చెప్పండి సార్ తెలిస్తే...పిల్లలు గలవాణ్ణి. కాస్త హెల్ప్ చెయ్యండి.'

రామానికి అంతలో మరో ఆలోచన తళుక్కుమంది.

'అల్లా అయితే ఈ హోటల్లో వున్న వాళ్ళెవరూ మన కారులో పట్టరు.' మా బాబాయ్‌గా పట్టడు.

కారులో ఒకరు పట్టగా మరోమనిషికి చోటుండేది. నీకో! నాకో! అంతే.'

'అంతే' అన్నాడు రంగనాథం ఖచ్చితంగా.

'అంటే నువ్వో నేనో హత్యచేసి వుండాలి !'

'అవును—కాని హత్య నేను చెయ్యలేదు. కనక !— నువ్వా! నువ్వు చేశావేమిటి కొంపదీసి...!!!'

ఎస్. అయ్. భోలానాథ్ ఆ మాటకు పకపక నవ్వేశాడు.

'ఈ జోక్కుకేంలెండి. ఇందాకా అంతే. మాకారు తాళం చెవులు చూపిస్తే అవ్వి నావే నన్నారు. ఈ కేసు నెక్కణ్ణించో ఫాలో అయి వస్తున్నారు. తొందరగా ఎవరో తెల్చెయ్యండి సార్. మీరు హెల్ప్ చేస్తానంటేనే యివ్వాళ నేను భోజనం చేస్తాను. లేదా ?— లేదు అంతే.' అని తెగ్రబతిమాలాడు.

అంత పెద్ద భోలానాథ్ అట్లా ప్రాధేయ పడుతుంటే—రంగనాథం సరే హెల్ప్ చేస్తా ననక తప్పలేదు.

'సరే హెల్ప్ చేస్తాలెండి.' అన్నాడు.

ఆ కాస్త హామీకే భోలానాథ్ పొంగి పోయాడు. పది పదిహేనుసార్లు థాంక్స్ చెప్పాడు. తర్వాత 'రండి సార్; ఈ పూట మనం ముగ్గురం కలిసి కూర్చుని భోజనం చెయ్యాలి. ఈ లోగా శవపరీక్ష జరిగి

రిపోర్ట్ వస్తుంది. తర్వాత ఆలోచిద్దాం.' అంటూ బలవంతం చేశాడు. స్నేహితు డిద్దరూ భోజనానికి లేవక తప్పలేదు.

భోజనానంతరం...

రామం రంగనాథం తను గదిలోకి వెళ్ళి చూస్తే తివాసీ ఒకమూల పైకి మడత వేసివుంది. దానికింద పెట్టిన నవల కాగి తాలు లేవు. వాటికోసం గది అంతా వెతికినా కనబడలేదు.

* * *

'నువ్వు పరమ మూర్ఖుడివురా.' అన్నాడు రామం.

'ఎందుకని? ఎందుకని నేను మూర్ఖుణ్ణి?'

ఇక్కడికి మనం నవల రాయటానికి వచ్చాంగానీ, కూపీలుతీసి—పోలీసుల్కి సహా యం చెయ్యటానికి రాలేదు.

'వచ్చామని ఎవరన్నారురా?'

'ఆ ఎస్. ఐ. మనిద్దర్నీ పెద్ద పత్తేదార్లు మనుకుంటున్నాడు.'

'నిన్నుగాదులే. నన్నొకణ్ణే అనుకుం టున్నాడు.'

'నువ్వు అల్లా పోజులు పెడుతుంటే అనుకోక ఏంచేస్తాడురా?'

'ఏం? పోజులు బాగుండలే?'

'ఇప్పుడీ కాగితాలు పోయాయి.'

'పోయాయి.'

'వాటిల్లో హత్యా వివరాలన్నీ రాశి వున్నాయి; వివరమేమో కొన్నితప్ప.'

'లేదు. వివరాలి వున్నాయి. ఎస్. ఐ. చెప్పుంటే గబగబా నే నన్నీ గెలికిపారే శాను తారీఖులోసహా.'

'తారీఖులోసహానా!'

'ఆ. నిన్నటి తారీఖు నిన్నా; ఇవ్వాల్టి తారీఖు యివ్వాళా. నువ్వేగా చెప్పావ్ — తారీకు లేందే ఉత్తరమన్నా రాయద్దని—!'

'చంపేశావ్;...ఇదంతా ఎస్. ఐ. ఛోటా వాధ్ వన్నిన పన్నాగంలాగుంది. మనల్ని భోజనాలకు లాక్కెళ్ళి—దొంగతనంగా కాగి తాలు తీయించుకెళ్ళాడు.

అవ్వాయన చూస్తే మనపని గోవిందా, ఇదంతా ముందే మీకెల్లా తెలుసంటే ఏం చెప్తాం?'

ఏం చెప్తామో నువ్వే నాకు ముందు చెప్పెయ్యి. తర్వాత నేను వేరే రకంగా చెప్పానని కోప్పడకు మళ్ళా.'

'నువ్వన్నీ ప్రాణంమీదకు తీసుకు వస్తూ వుండూ; ఉపాయాలన్నీ నేను చెప్తుం టాను. ఛీ. ఛీ.' రామం విసుక్కున్నాడు.

'ఎందుకురా–అల్లా విసుక్కుంటావ్? నేనే నవలలో హీరోనై పోతున్నాననా?'

'ఆ! నవలలో నువ్వు హీరోవా?'

'కాదూ మరి; నేనే హంతకుడెవరో కనిపెట్టేస్తున్నాగా.'

'కనిపెట్టేస్తున్నావ్?!'

'ఆ; హోటల్లో అతిధులుగా వచ్చిన వాళ్ళెవరూ హంతకులు కాదు. మనం హత్య చేయలేదని మనకి తెల్సు. ఇకపోతే ఫజుల్ సాయిబ్బూ కాదు. అతనూ మన కారులో వచ్చాడు. ఇక పరిచారకుల్లో ఎవరో ఒకరు హత్యచేసి వుండాలి. తప్పదు. అందుకని—ఓసారి పరిచారకు లందర్నీ పిలిచి, వరసగా నుంచోబెట్టి— ఒక్కొక్కణ్ణే కారు వెనకసీటు ముందుచోటులో కూర్చో చూస్తే సరి. ఎవరు తేలిగ్గా ఆ ఖాళీలో యిరుక్కుంటే,— వాడే హంతకుడు.'

రామానికి క్రమంగా జ్ఞానోదయ మయింది. మొహం మల్లెమొగ్గలాగ విక సించింది. కాని రంగనాధం మొహమే పూర్తిగా ఒడిలిపోయింది. నల్లమసిబొగ్గయి పోయింది. మాటలు తడబడటం మొద లెట్టింది. చేతులాడటంలేదు. ఒణికిపోతూ 'బా...! బ్బా...! బ్బా...!' అంటున్నాడు.

'ఏమిటా! అని అనుమానించి రామం వెనక్కి తిరిగిచూస్తే— కిటికీ కవతల— సన్నగా—పీలగా వున్న— ఒక నిండు ముసుగుమనిషి కనిపించాడు.

ముసుగుమనిషి కనిపించి మెదలకుండా మాయమైపోలేదు.

'జాగ్రత్త; ప్రాణాలమీద ఆశ వుంటే నోరు మూసుకుని వుండిపొండి. లేదా—!' అంటూ వక బాకు విసిరేశాడు. విసిరేసిన బాకు సరిగ్గా—ఎదురుగావున్న కాలెండర్‌లో సినిమాసుందరి బొట్టుమీద గుచ్చుకుంది.

(ఇంకా వుంది)

## గృహిణులకు కొన్ని సలహాలు

కాసింత సున్నం నీళ్ళలో కలిపి పుల్లటి మామిడి ముక్కల్ని కడిగితే పులుపు తగ్గుతుంది.

అప్పుడప్పుడు పాలు పుల్లటి వాసన వేస్తాయి. అలా పులుపువాసన గల పాలను వేడిచేస్తే విరిగిపోతాయి. అలా విరిగి పోకుండా ఉండాలంటే కాసింత తినే సోడా వేసి వేడిచేస్తే విరగవు.

కాస్త ఎరుపుగా ఉన్నబియ్యాన్ని బాగా కడిగి ఉడికేటప్పుడు ఒక నిమ్మకాయముక్క పిండితే అన్నం తెల్లబడుతుంది.

అరటి కాయలు 5, 6 రోజులవరకూ పండి పోకుండా పచ్చిగా ఉండాలంటే కాయల్ని నీళ్ళల్లో వేసి ఉంచాలి.

పెరుగు తియ్యగా ఉంటుంది చలి కాలంలో. వేడివేడి పాలల్లో ఒక స్పూను పంచ దార వేసి—వేడిగా ఉండే ప్రదేశంలో ఉంచితే పులుస్తాయి.

ఉల్లిగడ్డను అడ్డంగా కోసి అట్ల పెనం పైన రాస్తూ దోసెలు పోసుకుంటే చక్కగా అంటకుండా వస్తాయి.

గిన్నెలకు ఉప్పు, వరిపిండి, (ఆవుడు) కలిపి అడుగున రాస్తే సులభంగా తోముకో వచ్చు.

నిమ్మకాయ ముక్కతో తల బాగా రుద్దు కుని వేడినీటి స్నానం చేస్తూ ఉంటే తలలో చుండుతగ్గుతుంది.

— శ్రీ రామలక్ష్మీనారాయణమూర్తి.




సూపరింటెండెంట్ ఇంజనీర్ రఘునాథరావు ఇల్లు ఒక అధునాతనమైన బంగళా. ఇంటిముందు పెద్ద కాంపౌండు. దానిచుట్టూ ఎత్తయిన గోడ. నౌకర్లు శ్రద్ధగా పెంచుతున్నతోట ఆ ఇంటికి మరింత అందాన్నిస్తోంది. ఇంటిముందు పెద్ద వరండా. ఆ వరండాలో కుర్చీలు వేసి ఉన్నాయి. అందమైన, నిశ్శబ్దమైన ఆ వాతావరణం చూస్తే 'శాంతి' అన్న రెండు అక్షరాలలోని మహాత్యమూ అక్కడే లభిస్తుందేమో అనిపిస్తుంది.

ఆ వేసవి ఉదయం తొమ్మిదిగంటలవుతుంటే రాజారావు నుదుటికి పట్టిన చెమట రుమాలుతో తుడుచుకొంటూ రఘునాథరావుగారిల్లు చేరాడు. సంశయంగా వరండాలో నిల్చుని లోపలికి చూస్తూ.

'సార్!' అని పిలిచాడు. జవాబు రాలేదు. కొద్ది వ్యవధిలో తిరిగి 'సార్! సార్!' అని పిలిచి కాసేపు ఎదురుచూశాడు ఎవరైనా వస్తారని. ఈ మారు కూడా జవాబు రాలేదు. లోపలినుంచి ఎవరైనా వచ్చి తన ఉనికి గుర్తిస్తేగాని లాభంలేదని వరండాలోనే స్తంభాన్ని ఆనుకొని నిలబడిపోయాడు తోటలోకి చూస్తూ. అతని ముఖంలో ఆరాటమూ విసుగూ స్పష్టంగా కనపడుతున్నాయి. కళ్ళు తోటని చూస్తున్నా మనసు ఆలోచనల్లో మునిగిపోయింది. ముప్ఫై రెండేళ్ల రాజారావు ఇప్పటికీ కాలేజీ కుర్రవాడు అంటే నమ్మబుద్దేస్తుంది ముఖాన్ని ఆవరించిన విసుగు పెరిగిన చిరుగడ్డం మూలంగా కొంచెం వయసు కనిపిస్తోంది. రాజారావు అలా చూస్తూండగానే లోపలినుంచి ఒక స్త్రీ వచ్చి రాజారావుని వెనకనుంచి చూసి 'ఎవరు కావాలండీ?' అంది. అతను కంగారుగా వెనక్కి తిరుగుతూనే 'నమస్కారమండీ' అనేశాడు. తీరా తన ఎదుట వున్న స్త్రీని చూడగానే తెల్లబోయాడు. మాలతి. నిస్సందేహంగా మాలతే. తను కలలో కూడా ఊహించని విధంగా తన ఎదుట నిల్చుంది. ఒకప్పుడు తన అంతరంలో ప్రత్యేకస్థానం వున్న మాలతి. నోట మాటరాక అలా వుండిపోయాడు. ప్రతినమస్కారానికి చేతులు జోడించిన మాలతి అదే పరిస్థితిలో వుంది కానీ ఇదివరకటిలా దైన్యంగా పేదరికంగా కాక మందంగా, హుందాగా వుంది. ఇంకా నిర్లక్ష్యంగా వుంది. ఆమె ముఖం వివర్ణమైనమాట నిజమే, కానీ వెంటనే తేర

కుంది. నిర్లక్ష్యంగా వుంచాలన్న ప్రయత్నం చేస్తూ,

'మీరు రాజారావ్ కదూ?' అంది సూటిగా ముఖంలోకి, చూస్తూ. రాజారావు అలా చూడలేకపోయాడు. పైగా తల వంచుకున్నాడు. అతను ఆలోచిస్తున్నది జవాబు కాదు. ఈ బహువచన సంబోధన గురించి. తనని పదేళ్ళలో మరచిపోయిందా? అలా అయితే 'నువ్వు రాజారావువేనా?' అనవచ్చుగా. మౌనంగా తల ఊపాడు, రాజారావు.

'ఏం ? ఇలా వచ్చారేం ?' అంది మాలతి విచిత్రమైన స్వరంలో.

'రఘునాథరావుగారి కోసం అండీ, ఆఫీసుపని ఉండి' అన్నాడు ఏమీ తీసిపోకుండా. ఇద్దరిలో ఒక విధమైన ఉద్వేగం. ఏవరిమటుకు వాళ్లే ఆలోచించేస్తున్నారు తర్వాతి ప్రశ్నకోసం. దుర్భరమైన నిశ్శబ్దం యేర్పడింది.

'ఓహో వారికోసమా? లేరు బయటికి వెళ్లారు. తిరిగి సాయంత్రందాకా రారు' అంది గొంతు పరిపరివిధాల మారుతుండగా. మాట్లాడితే తన పరిస్థితీ అంతే అని తెల్సుకుని రాజారావు శలవు తీసుకుని వెంటనే తిరిగి బయటికి వచ్చేశాడు. రఘునాథరావులాంటి కార్యదక్షుడూ, తెలివైనవాడూ, మంచివాడూ తన పై అధికారి అన్న విషయం యీ రోజే రాజారావుకి మొట్టమొదటి సారిగా బాధ కలిగించింది. రఘునాథరావు మాలతి భర్త. ఎంతోకాలం తరవాత మాలతి కనిపించినందుకు ఆనందం, ఆమె భర్త తన పై ఆఫీసరన్న భావం కలిగించిన దుఃఖం, యీ రెంటివలనా మతి చలించినంత పనయింది రాజారావుకి. ఇన్నేళ్లుగా తను చేస్తున్న యీ హెడ్‌క్లర్క్ ఉద్యోగం తనకి ఉపాధితోపాటు, ఉన్నతమైనది కూడానూ. ఇంత మంచి ఉద్యోగంలోనూ తను రెండు మూడుసార్లు పొరపాట్లు చేశాడు. పూర్వం ఎన్ని తప్పులైనా క్షమించిన ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, తన దగ్గరుండగా ముఖ్యమైన ఫైల్స్ పోవడం క్షమించలేక పోయాడు. అందుకే గుణపాఠం చెప్పతలచి చింతలపల్లికి ట్రాన్స్‌ఫర్ చేయించి పారేశాడు. అటువంటి అనాగరకమైన, అడవిలాంటి ప్రదేశంలోకి వెళ్ళాలంటే భయపడి పోయాడు రాజారావు. ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ తప్పించగల వ్యక్తి రఘునాథరావే అని తెల్సుకుని, వారికి తన బాధలు నివేదించుకోవాలని రఘునాథరావు ఇంటికి మొట్టమొదటిసారిగా వచ్చాడు. కానీ ఇలా అనుకోకుండా మాలతి కనిపిస్తుందని, తన దైన్యాన్ని ఇంత దారుణంగా చాటుకోవల్సి వస్తుందని ఊహించలేదు రాజారావు, పరిస్థితులు తారుమారయివుంటే హెడ్‌క్లర్క్ రాజారావు భార్య మాలతి. తనతోపాటు ఇబ్బందులు పంచుకుంటూ అదే తృప్తి అనుకుని ఆత్మవంచన చేసుకునేది. కానీ ఈ రోజు ఆఫీసరు భార్య మాలతి. తనలాంటి ఎందరో గుమాస్తాలని చూసి జాలిపడుతోంది యీ రోజు. ఆమె ముఖంలో పూర్వపు అమాయకత్వం లేదు. ప్రపంచాన్ని కాచి వడబోసినట్లుంది ఆమె ప్రస్తుతం తీరు.

రాజారావు బి. ఏ. చదువుకునే రోజుల్లో పల్లెటూరి నుంచి. పట్నం సైకిల్‌మీద వెళ్ళి చదువుకునేవాడు. రోడ్డు బాగున్న రోజుల్లో ఆ రెండు ఊళ్లమధ్యా బస్సు నడిచేది. బస్సు ఆసరా చూసి ఇద్దరు అమ్మాయిలు పట్నం కాలేజీలో చేరారు. అందులో మాలతి ఒకర్తి. బస్సు నడచిన ఆ రోజుల్లో అనుభవాలు రాజారావూ, మాలతీ ఇప్పటికీ మరచిపోలేదు. 'ఎప్పుడూ కిటకిట లాడుతూ వచ్చే ఆ బస్సులో జనాన్ని ఒడుపుగా పక్కకి నెట్టి ఆ ఇద్దరు అమ్మాయిలకీ చోటు చేసేవాడు రాజారావు. తను ఫుట్‌బోర్డుమీదే తంటాలు పడుతూ ప్రజల దురభిమానానికి, పాత్రుడయ్యేవాడు. ఈ క్రియ నిత్యమూ ఇలాగేవున్నా, ఆ అమ్మాయిలు, అది వాళ్ల హక్కు అన్నట్లు వెళ్లేవారేగానీ, చిన్న నవ్వైనా రువ్వేవారు కారు. అందుకని ఫుట్‌బోర్డు వదలి లోపలికి దూరేవాడు రాజారావు. ధైర్యం చేసి దగ్గరగానే నుంచునేవాడు వాళ్లకి. ఆసరాకోసం ఊచలు పట్టుకున్న మాలతి చేతులు రాజారావుకి తగలడం, అతను తెలియకుండానే ముఖం ప్రవరాఖ్యుడిలా పెట్టడం జరిగిపోయేది. ఇటువంటి సుదినాల్లో రోడ్డు గండిపడింది. ఊళ్లో రాజకీయాలు రోడ్డు మరమ్మత్తు సాగనివ్వలేదు. ఇది రాజారావుకి మొదట గాయంలా తోచినా రానురాను వరమే అయింది. కాలేజీ కొర్లు నెపంతో రాజారావుని కలుసుకునేది మాలతి. ఊరివాళ్లకి ముందు యిది ఎబ్బెట్టుగా తోచినా, కాలేజీచదువు ఆ మాత్రం విప్లవాత్మక మనస్తత్వం లేక పోతుందా అనుకున్నారు. కానీ అది గాఢానురాగం అవుతుందని ఎవ్వరూ కలగనలేదు.

రాజారావు చాలా చాదస్తుడు కొన్ని విషయాల్లో. పొలంగట్లమీదా, కాలవ ఒడ్డునీ కూర్చుని తను భవిష్యత్ గురించి ఆలోచించారు. రాజారావుకి కొన్ని భయాలూ, నిర్దిష్టమైన నియమాలూ వున్నాయి. ఉద్యోగంలో చేరితేగానీ పెళ్లి చేసుకోడం తన కిష్టంలేదనీ మాలతితో చెప్పాడు. భవిష్యత్ కలల్లో భార్యగా అలాగేనంది. ఇవి ఇలా ఉండగానే రాజారావు చదువు అయిపోడమూ, అవసరంగా ఉద్యోగంలో చేరాల్సివచ్చి, చిన్న ఉద్యోగంలో చేరిపోయాడు. మాలతి పెళ్లికి తొందర చేసింది. రాజారావుకి తనని పెంచి పెద్ద చేసిన మేనత్త తప్ప పెద్ద పోషించవల్సిన వాళ్లెవరూ లేరు. కానీ మేనత్త ఆస్తి తన చదువులతో పూర్తయ్యేసరికి ఉద్యోగం చెయ్యాల్సి వచ్చింది. అదైనా నూటయాభై రూపాయల ఉద్యోగం. మంచిఉద్యోగం సంపాదించేదాకా ఆగమన్నాడు మాలతిని. ఉద్యోగం ఎప్పుడో దొరకాలి. అప్పుడు పెళ్ళి చేసుకోవాలి. అంత వ్యవధిలో రాజారావు దూరం కాకుండా వుంటాడా అన్న భయం మాలతిని ఆవరించింది. అందుకే 'నేనింకేమీ వినదల్చుకోలేదు రాజా! వచ్చే నెలలో మనం పెళ్లిచేసుకోవాలి. నూటయాభై రూపాయలు మనకి చాలవూ? చాలందే ఉద్యోగం నెమ్మదిగా అదే దొరుకుతుంది. ఎలాగో తంటాలు పడదాం'అని తేల్చేసింది. మొత్తానికి అనునయంగా మాట్లాడి మాలతిని కొంతకాలం ఆగమని ఒప్పించేసరికి రాజారావు తలప్రాణం తోకకి వచ్చింది. కానీ కొన్ని నెలలుమాత్రమే ఇది మామూలుగా నడిచింది. మాలతికి ఇంట్లో పెళ్ళి చేసుకోమని వత్తిడి ఎక్కువయింది. పెళ్ళి చూపులకి ససేమిరా కూర్చోనన్న మాలతికి రాజారావుని ప్రేమించిన సంగతి చెప్పక తప్పలేదు. రాజారావు స్థితిగతు లెరిగిన మాలతి తండ్రి ఒప్పుకోకపోవడమేకాక తన అయిష్టం వ్యంగ్యంగా వ్యక్తపరిచాడు రాజారావు లేమి మీద.

# శిక్ష

ఒకరోజు రాత్రి రాజారావు భోజనంచేసి కిటికీదగ్గరవున్న బల్లముందు కూర్చుని ఎం. ఏ. లో చేరాలని తెప్పించిన అప్లికేషన్ ఫారమ్స్ చూస్తూ ఆలోచిస్తున్నాడు. పైచదువు చదివితేగానీ బి. ఏ. వాళ్ళకి ఉద్యోగాలు దొరకడం ఉట్టిమాట. చదువుకి ఎలాగో ఏర్పాటు చేసుకున్నా మాలతిని అన్నాళ్ళు విడిచి ఎలా వుండడం అని. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి అప్లికేషన్ పూర్తిచెయ్యడం మొదలుపెట్టాడు. నిర్ణయం ఏమిటంటే త్వరలో మాలతితండ్రిని కలుసుకుని తన సంగతి, మాలతి సంగతీ చెప్పి త్వరలో పెళ్ళిచేసుకొంటానని చెప్పి ఎం. ఏ. లో చేరడం. ఆయన సమ్మతించని పక్షంలో, దైవ నిర్ణయానికి భారంవేసి, ఏమాత్రం అవకాశం వున్నా మాలతిని వివాహం చేసుకోడం. రాజారావుకి మనుషుల మీద, సంఘంమీద గురి ఎక్కువ. ఈ రెంటినీ ఎదిరించి బ్రతకలేమన్నది అతని సిద్ధాంతం. మాలతి తండ్రిని ఎలాగో అలా తను ఒప్పించగలడని ఒక మొండిధైర్యం. అప్లికేషన్ వ్రాయడం పూర్తిచేసి ఒకసారి చదవడం మొదలుపెట్టాడు. ఇంతలో కిటికీ బయటినుంచి ఎవరో మెల్లగా పిలుస్తున్నట్లనిపించి తల ఎత్తి చూశాడు. మసక వెన్నెట్లో ఒకస్త్రీ ఆకారం కనిపించింది.

'నేను రాజా! మాలతిని బయటికి రా' అంది. ఆశ్చర్యమూ భయమూ ఆవరిస్తూండగా కంగారుగా బయటికి వచ్చాడు రాజారావు.

'ఏమిటి మాలతీ ఇలా వచ్చావ్ రాత్రివేళ. ఎవరూ చూడలేదుకద.' అన్నాడు కంగారుగా. లేదు అన్నట్లుగా తలూపి మౌనంగా నిల్చుంది తల దించుకుని. ఆమె చేతిలో ఒక ఎయిర్ బ్యాగ్ వుంది. ఆమె లోని ఆందోళన ఆతృత ఆమె కాలివేళ్ళు నేలమీద గియ్యడంలో స్పష్టమౌతున్నాయి. రాజారావుకి ఆమె మౌనం మరింత ఆతృత కల్గించింది.

'ఏమిటి మాలతీ, ఏం జరిగింది? మాట్లాడవేం?' అన్నాడు ఏదో జరగరానిదే జరిగిందని ఊహిస్తూ.

'మనం వెళ్ళిపోవాలి రాజా.'

'ఎక్కడికి?'

'ఎక్కడికైనా సరే. మా ఇంట్లో ఈ రోజు సాయంత్రం గొడవ జరిగింది. మా నాన్న ఏదో సంబంధం స్థిరపరచడానికి నిశ్చయించుకున్నాడు. నేను కాదన్నాను. దానిగురించి గంట వాదన జరిగింది. నేను ఒప్పుకోందే కాళ్ళూ చేతులూ కట్టిపడేసి అయినా పెళ్ళి చేస్తానన్నాడు నాన్న...'

'అందుకని?' అన్నాడు లోపలినుంచి భయం ఆవిర్భూతమవుతుంటే. వింతగా చూసింది మాలతి రాజారావుని.

'మా నాన్న పక్క ఊరెళ్ళాడు. మా అమ్మకి తెలియకుండా నేను వచ్చేశాను. మనకి ఆట్టే టైమ్ కూడా లేదు. పద రాజారావ్!' చివరిమాటలు అంటూంటే ఆమె గొంతు కంపించింది.

'ఏమిటి మాలతీ నువ్వనేది. లేచిపోదామంటావా? నువ్వు అనవసరంగా తొందరపడకు. నేను అంతా ఆలోచించాను. రేపే మీ నాన్నతో మాట్లాడతాను...'

'రాజా, నీకిచ్చి చేస్తాడన్నది అసంభవం. ఊరికే మనం నవ్వుల పాలవ్వాలి. ఇంతకంటే గత్యంతరం లేదు. నేనూ ఆలోచించాను పద రాజా!' అని అతని చెయ్యి పట్టుకుని తొందర చేసింది.

'ఉండు మాలతీ. మరీ చిన్నపిల్లలా ప్రవర్తించకు. మీ నాన్న రావాలికదా. సంబంధం నిశ్చయం చెయ్యగానే అయిపోయిందా? నేను రేపు ఉదయమే వెళ్ళి మాట్లాడతాను. కాదంటాడా మనం వెళ్ళిపోదాం సరేనా?'

'అయ్యో రాజా! నీకెలా చెప్పాలో తెలియడంలేదు. నేను ఇంట్లోంచి వెళ్ళిపోతున్నానని ఉత్తరం కూడా పెట్టాను' అంది ఆవేశంగా.

రాజారావు కూడా నఖశిఖపర్యంతమూ కంపిస్తున్నాడు. అతని గొంతుకే దానికి సాక్ష్యం.

'చూడు మాలతీ. నువ్వు చిన్న విషయాన్ని కొండంతలుచేసి బాధపడుతున్నావ్. ఇలా ఉన్నట్లుండి వెళ్ళిపోడంలో ఎన్ని యిబ్బందులున్నాయో నీకుమాత్రం తెలియదా? పైగా నీకు వాళ్ళెవరు. తల్లీ తండ్రీను. ఎంత పొరపాటు చేసినా క్షమించే ఓపిక వాళ్ళకుంటుంది. అందుకని అర్థంలేని ఆలోచనలు మాని ఇంటికెళ్ళు. పొద్దుటే నే వస్తాను' అన్నాడు, ఈ

మాటలు వినివేసి తీరుతాననుకుంటూ. చేతిలోని బ్యాగ్ కిందపడేసి కుప్పలా కూలిపోయి ఘొల్లుమంది మాలతి.

'అయ్యో మానాన్న సంగతి నీకు తెలియదు రాజా. ఇంతకంటే బాగా నా పరిస్థితి ఎలా చెప్పాలో తెలియడం లేదు. నామాట నమ్ము రాజా. మనకి వేరే మార్గంలేదు' అంది వెక్కిళ్ళ మధ్యన. రాజారావు స్థాణువు అయిపోయాడు. ఆమెని ఊరడించాలని కూడా అతనికి తట్టలేదు. అతనిబుర్ర పనిచెయ్యడం మానేసింది. ఒకపక్క మాలతి. ప్రపంచం తెలియని మాలతి. తను కావాలనుకోడం తప్ప తనతో ఇబ్బందులు ఊహించలేని మాలతి. మరొకపక్క లోకం. దాన్నెదిరించి సాధించేది శూన్యం, అని రూఢిగా నమ్మే రాజారావు స్థాణువే అయి నిలుచున్నాడు. కొంతసేపటికి తేరుకున్న మాలతి మెల్లగా లేచి రాజారావు దగ్గరగా వచ్చింది. అతని చేతిని తన చేతిలోకి తీసుకుని 'పద రాజా ఆలస్యం చెయ్యకు. నీకు నేను నిజంగా భారంగా, తోచిననాడు నన్ను విడిచేసినా నాకు సంతోషమే. కానీ ఇప్పుడు ఆ పని చెయ్యకు. త్వరగా నడు రాజా. మా వాళ్ళు ఆ ఉత్తరం చూస్తే ప్రమాదం' అంది. రాజారావు చీకట్లోకి చూస్తూ ఉండిపోయాడు. అతని నరనరాల్లో భయం నిండిపోతోంది. అలాగే ఆలోచనలలో మునిగిపోయి మౌనంగా నుంచున్నాడు. మాలతి ఆ మౌనం భరించలేకపోయింది.

'మాట్లాడవేం రాజా' అని అతన్ని కదిపింది.

'ఊఁ' అని ఆలోచనల్లోంచి తేరుకొని చేతులు కట్టుకుని ఎటో చూస్తూ అన్నాడు.

'మనం వెళ్ళడం అసంభవం మాలతీ... నీకు నామీద గౌరవం, నేను మీ నాన్నని ఒప్పించగలనని నమ్మకం ఉంటే, ఇప్పటికైనా నా సామర్థ్యంమీద నీకు నమ్మకం ఉంటే నామాటకి విలువయిచ్చి నువ్వు ఇంటికి వెళ్ళిపో... మహా అయితే ఎంత పన్నెండుగంటలు మన గొడవ తేలిపోడానికి. పొద్దుటే...'

'రాజారావ్' గట్టిగా అరచింది మాలతి. 'ఇలా మానులా తయారయ్యావేం. చదువుకున్నవాడివి నా పరిస్థితి ఎందుకు అర్థం చేసుకోలేక పోతున్నావో తెలియడంలేదు. నీ సామర్థ్యంమీద నాకు నమ్మకంలేదు. నువ్వు కావాలి అనుకొన్నాను. నీతో బ్రతకాలి అనుకున్నానంతే. నువ్వు నాకేదో చెయ్యాలని అనుకోలేదు. నీ భయాలూ సంశయాలూ నాకు తెల్సు. అయినా నిన్ను మార్చడం అసంభవం అని నేననుకోలేదు. బొత్తిగా ఇంత పిరికివాడవనీ, ఇంత సంశయిస్తావనీ అనుకోలేదు. అది నా ఖర్మ. సరే ఇక నిన్ను జీవితంలో ఏదీ కోరదల్చుకోలేదు ఒక్క చిన్న సహాయం తప్ప. దానికైనా సాహసం చేస్తావని నా ఆశ. దయచేసి ఈ బ్యాగ్ నీ దగ్గరుంచు యీ రాత్రికి. ఒకవేళ మా వాళ్ళు నా ఉత్తరం చూడందే అదృష్టవంతురాలినే, బయటికి వెళ్ళాననుకుంటారు.' విపరీతమైన కోపంతో శక్తిలావుంది మాలతి. తాత్కాలికంగా ఆమెలో దుఃఖంలేదు ఆవేశం తప్ప.

'ఇంకోమాట. దయచేసి రేపు నువ్వు మా ఇంటికి రానూవద్దు. మా నాన్నని అడగనూ వద్దు.'

'మాలతీ. ఏమిటీవెర్రి. మరీ అంత ఆవేశం పనికిరాదు. ఆడదానికి అంత ఆవేశం పనికిరాదు. ఇంకా ఈరోజు నీతో నేను ఎమ్. ఏ.కి వెళ్తున్న సంగతి చెప్పాలని, నిన్ను సంతోషపెట్టాలనీ అనుకున్నాను. మీ నాన్నని ఒప్పించడం నువ్వనుకున్నంత కష్టమూకాదు. నేను నువ్వూహించినంత అసమర్థుణ్ణీ కాదు.'

'ఇంకేమీ చెప్పకు రాజారావ్. నాకు నీ ఎదురుగా ఉంటే ఒకవిధమైన వెలపరం వస్తోంది. జాగ్రత్తగా ఎమ్.ఏ. చదువుకో. మీ అత్తయ్యని సుఖపెట్టు' అని వేగంగా

పరుగెత్తి వెళ్ళిపోయింది. 'మాలతి' అని పిలవబోయి రాత్రివేళ, పైగా రోడ్డుమీద, అన్న సంగతి గుర్తువచ్చి మాలతి బ్యాగ్‌తో సహా ఇంట్లోకి నడిచాడు రాజారావు.

మర్నాడు ఉదయమే ఆత్రంగా మాలతి ఇంటికి వెళ్ళాడు రాజారావు. పాడుపడి వట్లున్న ఒక కాంపౌండుకి చిన్నగేటు వుంది. మెల్లగా గేటుతీసి లోపలకి అడుగు పెట్టాడు. వరండాలోనే కుర్చీలో ముఖానికి అడ్డంగా చెయ్యిపెట్టుకుని కూర్చుంది మాలతి ఆమె ఆకారం చూడగానే భయం వేసింది రాజారావుకి. రాత్రి పెద్దగొడవ జరిగిందని ఆమెని చూస్తేనే తెలుస్తోంది. అడుగుల చప్పుడుకి చటుక్కున తలెత్తి చూసింది మాలతి. రాజారావుని చూడగానే అప్పటివరకూ నీరసించినట్లున్న ఆమె ముఖం కోపంతో భయంకరంగా మారిపోయింది ఉన్నచోటనుంచి పరుగెత్తి వంతా వేగంగా రాజారావుని చేరింది.

'ఇడియట్ మళ్ళీ ఎందుకు వచ్చావ్. చెయ్యవలసిందంతా నిన్నే చేసి ఈ రోజు ఏ మొహం పెట్టుకుని వచ్చావ్. వెంటనే వెళ్ళిపో.' చివరికి నా ఉత్తరం మావాళ్ళు చూడనే చూశారు ఒక్కరాత్రిలో నా జీవితాన్ని ఇలా దుర్భరంగా మార్చేస్తావని అనుకోలేదు' అంది ఆవేశంగా. ముందు మాటరాక ఉండిపోయాడు రాజారావు. తరవాత నెమ్మదిగా 'మాలతీ, నామాట విను. జరిగిందానికి బాధపడకు. నేను మీ నాన్నగారితో...'

'రాజారావ్!' వెర్రిగా అరచింది మాలతి. 'వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపో, లేందే చాలా రభస అవుతుంది. వెళ్తావా వెళ్ళనా ?' అంది అంతపనీ చేసేపేలాగ. విపరీతమైన అవమానంతోటీ, అసహనంతోటీ మాలతిని మింగేసేలా చూస్తూ తిరిగి వెళ్ళిపోయాడు రాజారావు.

అలా వెళ్ళిన రాజారావు మళ్ళీ మాలతి ముఖం చూడలేదు. ఆ ఊళ్ళోనూ ఉండలేదు ఎన్నో ఏళ్ళు, ఎన్నోఊళ్ళు తిరిగాడు ఉద్యోగరీత్యా. కానీ ఇన్నేళ్ల తరవాత మాలతిని ఇలాగ, తన పై ఉద్యోగి భార్యగా చూస్తాడని కలలోకూడా ఊహించలేదు.

ఆ రోజు సాయంత్రం మళీ వెళ్ళాడు రాజారావు, రఘునాథరావు ఇంటికి. ఈసారి తోటలో కుర్చీలు వేయించి వున్నాయి. మాలతి ఖరీదైన దుస్తుల్లో తలనిండా పువ్వులు పెట్టుకుని ఏదో పుస్తకం చదువుతూ కనిపించింది. క్షణంసేపు నివ్వెరపడ్డాడు రాజారావు తను వస్తాడని తెల్సి తన హోదా ప్రదర్శించాలని అలా కూర్చుందా అనిపించిందతనికి. అయినా గతంలోని మాలతి తొంగి చూసింది ఆమెలో పూర్వపు ఆమె అమాయకత్వం, చిలిపితనం గుర్తు వచ్చాయి రాజారావుకి. ఊహల్లోంచి బయట పడుతూ ప్రొద్దుటిలా కాకుండా ధైర్యంగానే ఆమెకేసి వెళ్ళాడు

'రఘునాథరావు గారు వచ్చారాండీ' అని, అనుకోకుండానే వ్యంగ్యంగా అనేశాడు. అతను రావడం దగ్గరనుంచీ అన్నీ గమనిస్తున్న మాలతి ట్యూషన్‌కి కుర్రాడు వచ్చినట్టు

'రా. కూర్చో వారింకా రాలేదు' అంది ఇలా అనుకోకుండా తనని ఏకవచనంలో పిలవడం అతనికి ఆప్యాయంగా అనిపించలేదు సరికదా, జుగుప్స కలిగించింది మాట్లాడకుండా కుర్చీ దూరంగా లాగి కూర్చున్నాడు ఇద్దరూ నిశ్శబ్దం పాటిస్తున్నారు. రాజారావు తలవంచుకుని కూర్చున్నాడు.

'చాలా మారినట్లున్నావే. ఎమ్. ఏ. పూర్తయిందా ?' అనడిగింది హఠాత్తుగా ఇప్పుడు తన ఎమ్. ఏ. గురించి ఆమె అడగడం నచ్చలేదు రాజారావుకి.

'లేదు, ఎమ్. ఏ. చదవలేదు'

'అయ్యో! అయినా మంచి ఉద్యోగమే సంపాదించావు పాపం' అంది గోళ్లకు వేసిన రంగు చూసుకుంటూ ఈమాటకి ఆమె ముఖంలో భావం చూద్దామని ప్రయత్నించాడు రాజారావు, సమాధానం చెప్పలేదు.

'అప్పట్లు పెళ్లి అయ్యే వుంటుందిలే. మీ భార్యామణి పేరు ?'

'అన్నపూర్ణ'

'చదువుకుందా ?'

'పి యు సి పాసయింది'

'అబ్బో, నాకన్నా నయమే.' అంది. మళ్లీ కాసేపు మౌనం.

'ఇంతకీ ఏం పనిమీద వచ్చినట్టు' అనడిగింది తన ట్రాన్స్‌ఫర్ సంగతి ఆమెకి చెప్పడం ఇష్టంలేకపోయిందతనికి.

రాజారావు ముఖంలో ఆవరించిన దుఃఖపు ఛాయలు మాలతిని కదిలించలేదు, ఏదో గుర్తు వచ్చినట్టులేచి ఇంటివైపు నాలుగడుగులువేసి నౌఖర్ని రెండుకప్పుల కాఫీ తెమ్మంది. తిరిగివస్తూ వయ్యారంగా చీర కుచ్చిళ్ళు ఒకచేత్తో పట్టుకుని హైహీల్స్‌తో నడక ఎలాగో చూపిస్తూ వచ్చి కూర్చుంది. చిన్న నిట్టూర్పు విడిచి అడిగింది.

'పిల్లలా'

'ఒక్కడే మగపిల్లవాడు...'

ఇంక సంభాషణ ఏమీ సాగలేదు రాజారావు చాలా చిన్నతనంగా ఫీల్ అవడం మొదలుపెట్టాడు. చివరికి తనని మాలతి కన్నా చాలా తక్కువ తరగతిలో, వేసుకున్ని చేసేది లేక నిర్మోహమాటంగా కూర్చున్నాడు గాంభీర్యం నటిస్తున్న మాలతిలో మంటలు చెలరేగుతున్నాయి ఎవరికోసం తను అన్నీ వదలిపెట్టి బయలుదేరిందో, ఎవరికోసం తను సిగ్గు కూడా విడిచి ఇంట్లోంచి పారిపోదాం అనుకుందో ఆ వ్యక్తి తనని ఎంత చిన్నచూపు చూశాడు. భరించలేని తృణీకారం అది తన నిస్సహాయ స్థితిలో రాజారావు తప్పించుకున్నాడు కానీ ఈరోజు అతను తన భర్తముందు చిన్న ఉద్యోగిమాత్రం. రఘునాథరావు భార్య అయినందుకు మొట్టమొదటిసారి గర్వించింది మాలతి. రాజారావు తన భర్తకింద ఉద్యోగి అన్నభావం కూడా మాలతికి తృప్తి నివ్వడంలేదు. రాజారావు జీవితంలో సెటిల్ అయిపోయాడు. ఒకభార్య, ఒకకొడుకు అతనికి గొప్ప ఉద్యోగి కానన్న విషయం తప్ప మరే దిగులూ లేదు తనుకూడా రాజారావుని పెళ్ళిచేసుకునే విషయంలో పొరపాటుపడి వుండవచ్చు అందుకు మరొక వివాహమే తనకు శిక్ష. ఇద్దరు పిల్లలతల్లి అయినా తనలో ఏదో అసంతృప్తి కానీ రాజారావుకే శిక్షపడాలి. ఎంత ఆనందంగా ఉన్నాడో. ఎలా జీవిస్తున్నాడో. రాజారావుకూడా తనంత మానసిక వ్యథ అనుభవిస్తేగానీ తనకి తృప్తి ఉండదు. ఇది మాలతిలోని అంతర్యుద్ధం. పౌరాణిక చిత్రల్లోలాగ అతనికి చిత్రవధ తప్ప మరొకటి సరిపోదు అనుకుంది. కనీసం మాటలతో అయినా అతన్ని పీడించాలి అను

కుంటే తనకే తెలియకుండాలేదు నీలా ప్రారంభించాలో. పెదవులు అదురుతుండగా అంది.

'ఏదో ఒకరోజు నిన్నిలా నాముందు తల వంచుకుని ఉండగా చూడాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నాను.'

'కోరికోరి నీ కాళ్ళమీదపడి వేడుకున్నా కరగని నిన్ను సరిగ్గా ఇలాగే చూడాలనుకున్నాను' అంది. ఇలా హఠాత్తుగా మారిపోయిన సంభాషణ విని వింతగా చూశాడు రాజారావు, మాలతిని. ఆమె చటుక్కున తల దించుకుంది. అప్పుడు ఆమె కళ్ళల్లోంచి జారిన రెండు కన్నీటిబొట్లు తళుక్కున మెరిశాయి. అయినా వెంటనే, నిర్లక్ష్యపు నవ్వుతో అంది

'నీ బలహీనతలన్నీ నాకు బాగా తెలుసు. అవన్నీ ఒక్కసారిగా నీలో చూడాలనుకున్నాను. నిన్ను యీ రోజు...' ఇంక మాటలు రాలేదు. ఉప్పెనలా దుఃఖం వచ్చేసింది రుమాలుతో అతికష్టంమీద ఏడుపు ఆపుకుంది. కానీ కళ్ళు కాలువలు అయిపోయాయి. మెల్లగా కాసేపు వౌనంగా అతిప్రయత్నంమీద ఆగింది. ఆమె 'ఎంత విలువైనది పోగొట్టుకున్నాను' అనుకుందో అతనికి అర్థమయింది. ఉన్నట్లుండి ఒక్కసారి లేచి ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె కంగారుగా లేచింది. ఒక్కసారి ఆమెను దగ్గరకు బలంగా చేర్చుకున్నాడు. ఆమె శరీరం వశం తప్పినట్లయిపోయింది. ఎన్నో ఏళ్ళ తపస్సు ఫలించినట్లయింది. అంతలోనే మళ్ళీ వెంటనే మామూలు స్థితిలోకి వచ్చింది. తిరిగి అతనికి లొంగిపోయానన్న కోపం ఆమెలో తలెత్తింది అతన్ని దూరంగా నెట్టేసి 'ఛీ, ఛీ. ఏం పని చేశావ్. మనిషివేనా నువ్వు' అని కంగారుగా 'నూకన్నా ! నూకన్నా !' అని పిలిచింది రాజారావు కంగారు పడ్డాడు. ఇంతలో ప్యూన్ పరుగున వచ్చాడు ఆమె కేకలకి.

'ఏమయిందమ్మగారూ' అనడిగాడు తనకే తెలియకుండా పెట్టిన కేకలకి సిగ్గుపడి ఏం లేదు. కాఫీ త్వరగా తీసుకురా' అంది. అంతవరకూ స్థాణువులావున్న రాజారావు 'కాఫీ అక్కర్లేదోయ్ నువ్వెళ్ళు' అన్నాడు ఇదంతా అర్థంకాక వింతగా చూస్తూ వెళ్ళిపోయాడు ప్యూన్.

అతను వెళ్ళగానే తలవంచుకుని ఇలా అన్నాడు రాజారావు

'క్షమించండి పొరపాటయింది. నేను మీవారి డిపార్ట్‌మెంట్‌లో క్లర్క్‌ని. కొన్ని రిపోర్ట్సువలన నన్ను పల్లెటూరికి ట్రాన్స్‌ఫర్ చేశారు. పేదవాడిని చాలా ఇబ్బందులు పడాలి మీ ఊరివాడిగా అభిమానం చూపి ట్రాన్స్‌ఫర్ ఆపుచేయించండి. కృతజ్ఞుడుగా ఉంటాను. మళ్ళీ రేపు వస్తాను. నమస్తే' అని వెంటనే తిరిగి వెళ్ళిపోయాడు కలలో చూస్తున్నట్లు అచేతనంగా అలాగే వుండిపోయింది మాలతి.

మర్నాడు ఉదయమే మళ్ళీ వెళ్ళాడు రాజారావు రఘునాథరావు ఇంటికి అదృష్టవశాత్తూ ఆయన ఉన్నాడు రాజారావు నమస్కారానికి ప్రతినమస్కారంచేసి ఏమిటన్నట్లు చూశాడు. మాలతి భర్తపక్కనే కూర్చుంది.

'అదేనండి. నా ట్రాన్స్‌ఫర్ సంగతి...' అని నసిగాడు రాజారావు. దానికి రఘునాథరావు వెంటనే 'ఐ. సీ. అందులో ఇంక ఆలోచించవల్సింది. ఏమీలేదు స్టాఫ్ తరఫున మీమీద చాలా పిటిషన్స్ ఉన్నాయి' అనేసి న్యూస్‌పేపర్‌లో నిమగ్నమయిపోయాడు. రాజారావు సహాయం కోరినట్లు మాలతిని చూశాడు ఆమె చూపు తప్పించుకుంది. తిరిగి ప్రయత్నించాడు.

'మీరు గనక తలచుకుంటే...,' అని. పేపరు మడిచి సీరియస్‌గా అన్నాడు రఘునాథరావు.

'అయామ్ సారీ నేను రెండు రకాలుగా మాట్లాడను. ఇంక మీరు వెళ్ళిపోవచ్చు' అని. రాజారావు నిస్పృహతో మాలతివైపు చూశాడు. జయించానన్నట్లున్నాయి ఆమె కళ్ళు. నీరసంగా వెళ్ళిపోయాడు రాజారావు. మాలతి భర్తవైపు తిరిగి అంది. 'ఇంత త్వరగా వదులుతాడనుకోలేదు' అని నవ్వ డానికి ప్రయత్నంచేస్తూ. రఘునాథరావు నవ్వలేదు.

'మాలతీ నా సర్వీసులో నేను చేసిన మొదటి పొరపాటు ఇదేనేమో. అందరూ అతను చాలా మంచివాడంటూరు. పూర్ ఫెలో ఈ మధ్య అతని భార్య చచ్చిపోయింది. చాలా బావుండేదిట. అతనికి మన పెద్దబాబు అంత కొడుకున్నాడు చింతలపల్లిలో స్కూలు లేదు అని గోల పెట్టాడు. ఆర్డర్స్ అసలు నేనే కేన్సిల్ చెయ్యాలనుకున్నాను. కానీ నువ్వు చెప్పేది వ్యతిరేకంగా వుంది అతన్ని గురించి అతన్ని ట్రాన్స్‌ఫర్ చెయ్యడంలో నీకు ఆనందమేమిటో నా కర్థం కాలేదు' అని తిరిగి పేపరు చదవడంలో మునిగి పోయాడు.

మాలతి అంతా విని మతిపోయినదానిలా కూర్చుంది రాజారావుమీద పగ సాధించడం ఎందుకోకూడా తనకే తెలియదు గేటు దాటి నిస్పృహగా వెళ్ళిపోతున్న రాజారావుని చూసి, కళ్ళు వర్షిస్తుంటే భర్తకి కనపడనివ్వక అక్కడినుంచి పారుతూ 'తనకి కావల్సిందేదో తనకే తెలియని అసమర్థురాలు నీకు విధించిన శిక్ష యిది రాజా' అను కుంది. ●



పోరటాలు సాగించారు, ఇప్పటికే సాగిస్తున్నారు. 'పుష్పక విమానాలేవో వొచ్చి వొళ్లో పడ్డాయనటం— ఉత్త అసూయతోనూ, తమ పదహారేండ్ల దోపిడీకి అవకాశాల అయ్యో సన్నగిల్లాయే ఎట్లా అనేది' వలస పెత్తందారీ మనస్తత్వంతో అనేది నిజానికి సుప్రీమ్ కోర్టు తీర్పు వల్ల 'వాదన్న నాకియ్యి రాజన్న దేవుడా!' అన్న దే (అదైనా అమలు చేసే నాధుడుంటే) తప్ప అదనంగా ఒరిగిందేమీ లేదు ఆకాస్త ఇందిరమ్మ పధకం, పార్లమెంటు బిల్లుల ద్వారా— లాగివేయడమే జరిగింది అయినా ప్రస్తుత ఆంధ్రలోని ఉద్యమం తెలంగాణావాళ్లకీ కాస్త సౌకర్యాలెందుకన్నటు సాగుతోంది, పత్రికల్లో రాతలూ అలాగే వుంటున్నాయి

ఇరు ప్రాంతాలలో నాయకుల స్వార్థం మాటేమిటో గాని సామాన్యుల, ప్రజల అభిమతం మాత్రం—స్నేహంగా విడిపోదామనే వుంది, 'జనం నాడి' పసికట్టలేనివాళు రోగం ఒకటైతే మందొకటిగా ప్రవర్తిసు న్నారు 'సుధామ'గారి మాటలు వైషమ్యాన్ని రెచ్చగొట్టుతాయే తప్ప మనస్సుల్ని అతుకవు నిజానికీ పదహారేండ్లుగా తమతోటి దగా పడిన తమ్ముళ్లని ఆంధ్రవాళు 'సుధామ' గారి లాంటి వారి దృష్టిలోచూడటం, రాతల్లోమాటల్లో ఆధిక్యత చూపడం— ఇదే ఇక్కడివాళ్ల భయానికి కారణం

ఇప్పటికే ఆంధ్ర వాళ్ల ఆధిపత్యంలో వున్న పత్రికల తెలంగాణావాళ మనసుల్ని విరిచేశాయి, అందునా 'బాంచెన దొరా' లాంటి అనాలోచిత మాటలు మరింత వైషమ్యానికి తోడ్పడుతాయేతప్ప మనసుల్ని అతుకవు, పాఠకుల వోర్మిని పరీక్షించటం ధర్మంకాదు. ఆంధ్రలో సాగే ప్రత్యేక రాష్ట్రోద్యమానికి ఇక్కడ అత్యధికులు హర్షం వెలిబుచ్చుతూ స్వాగతం పలుకుతున్న తరుణంలో— ఇరు ప్రాంతాలవారి ధ్యేయం ఒకటే అయినప్పుడు ఇక ఆ ధ్యేయంకోసమే పత్రికలు దోహదం చేయటం అవసరం బాధ్యతా కూడ 'జై ఆంధ్ర! జై తెలంగాణా!'

**గమనిక** ఈలేఖ తప్పకుండా ప్రచురిస్తారనే నమ్ముతున్నాను.

పెండ్యాల చినరాఘవరావు,
—కాజీపేట— జంక్షన్, (తెలంగాణ)

* * *

నేడు ఆంధ్రప్రదేశ్‌లోని పరిస్థితులపై మీ పత్రికలో పడుతున్న ఉత్తరాలు ద్వేషాల్ని రెచ్చగొట్టేవిగా ఉంటున్నాయి దూషణ తిరస్కారములు లేకుండా యదార్థ పరిస్థితులను సమీక్షించే ఉత్తరాలు మాత్రమే ప్రచురించ వలసింది ప్రజాదరణ గల ఉత్తమ తెలుగు పత్రికగా వాస్తవికతలను ప్రజలముందుంచే ఉత్తరాలు ప్రచురించాలిగాని తిట్టుకవిత్వపు ఉత్తరాల వల్ల ప్రయోజనం శూన్యం. ఉదాహరణకు తెలంగాణా మిగులు నిధులు అనేవి హైదరాబాదు రెవిన్యూలో సాలీనా 30కోట్ల దాకా ఆంధ్రప్రాంతం డబ్బు కలపటంవల్ల

# ఉత్తరాలు

## (4వ పేజీ తరువాయి)

వచ్చినవని వ్రాయవచ్చు దాన్ని తెలంగాణావారు సహేతుకంగా తిరస్కరించవచ్చు. అల్లాగే తెలంగాణా వారనుకున్న ఉద్యోగ విషయాల్లో అన్యాయాల్ని మనం అన్యాయాలు కావని వివరించవచ్చు అంతేగాని పరస్పరం 'కించపర్చుకోవడం అనవసరం ఆంధ్రప్రదేశ్ రెండుముక్కలయినా సఖ్యతతో ఇరుగుపొరుగ రాష్ట్రాల వారిగా జీవించావలసిన వారమే గదా భారత్‌లో తెలుగుకు సముచితస్థానాన్ని నిలబెట్టడంలో ఇరుప్రాంతాలవారి స్నేహం అవసరమేగదా ఉత్తరాలు వ్రాసేవారు ప్రకటించేవారు నా ఈ కోర్కెను మన్నిస్తారని తలుస్తాను

—యు రాజ్యలక్ష్మి, (కాకినాడ)

## సినిమా

గత సంచికలో శ్రీనివాస్‌గారు ఆంధ్రఉద్యమము పై సినిమాతారల అభిప్రాయాలు తెలుపుతు ఒక్క శీర్షిక వ్రాసారు, శీర్షిక బాగినేయుంది కాని తారలు వారి అభిప్రాయాలు తెలుపుతూ వారి పేర్ను ప్రకటించ నిరాకరించటంమాత్రం చాల ఆశ్చర్యముగా యుంది.

మన తెలుగు సినీపరిశ్రమ యావత్తు ప్రజలపై ఆధారపడియున్నది మరి అలాంటప్పుడు ప్రజా ఉద్యమముగూర్చి అభిప్రాయాలు తెలుపుతూ పేర్ను ప్రకటించకపోవటం చాల విచారకరం సినీపరిశ్రమ వారు ప్రభుత్వానికి భయపడా? లేక వారికి ఉద్యమముపై, సదభిప్రాయం లేకనా? మరి, మా తెలంగాణా ప్రజలకు భయపడా? మరి ఎందుకు జంకి వారిపేర్లు తెల్పలేదో? అర్థము కావటంలేదు, నేడు తెలుగు ప్రజలలో రెండు ప్రాంతాలు, మంచిగా సోదర భావముతో విడిపోవాలని ఏక కంఠముతో చెప్పుచున్నారు. అలాంటప్పుడు సినీపరిశ్రమవారు ఎవరినిచూచి భయపడుతున్నట్లు? అభిప్రాయాలు చెప్పకపోయిన వచ్చిన బాధలేదు, కాని పేర్లు తెల్పక పోవటం చాల సిగు చేటు

—పల గాని రామనర్సయ్య, (డోర్నకల్)

## ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు

ఈమధ్య ఉత్తరాల శీర్షికకూడ, ఆంధ్రదేశ పరిస్థితుల చర్చా వ్యగ్రాలతో యుపయోగకారిగ తయారగుచున్నది

తే 26 1 73 ది గల పత్రికలో శ్రీ వింజమూరు భాస్కరాచార్యులుగారి యుత్తరము చదివితిని వారు, కొన్ని పొరపాటు చేసినారని అనిపించుచున్నది.

ప్రభుత్వ జాతకము పరిశీలించునపుడు దశమ స్థానమును కూడ విచారింపవలెను కాని యెందు వలననో వారు రాజ్యస్థానమైన దశమమును విచారింపలేదు వారు ఇచ్చిన రాశి చక్రమును బట్టి, దశమస్థానమైన మేషములో బాధాకాధిపతి శుక్రుడు స్థితి నొంది యున్నాడు. దశమాధిపతి కుజుడు, దశమమునకు మారకమైన 11వ ఇంటిలో స్థితి నొందినాడు. గురుడు, స్వక్షేత్ర, ఉచ్ఛనవాంశలంది యును, శుక్రుడు స్వనవాంశనొందియును బలవంతు లగుట శుభముగా పేర్కొనబడియున్నది కాన గురుడు ఈ జాతకమునకు శత్రుస్థానాధి పతి. శత్రుస్థానమునుండి దశమ స్థానమున వీక్షించుచున్నాడు శుక్రుడు బాధాకాధిపతి ఈ గ్రహములు బలముతయులగుట యే విధముగను మంచిదిగాదు.

శత్రుస్థానాధిపతియై, దశమస్థానమును వీక్షించుచున్న గురువు తనభుక్తిలో మంత్రివర్గపతనమునకు కారకుడగుటలో ఆశ్చర్యము లేదుకదా ఇంతియేకాక గోచార రీత్యా యేల్నాటి శని జరుగుచున్నది. యేల్నాటి శని ప్రభావమును భాస్కరాచార్యులు గారు యెందుకో విస్మరించినారు 1939 1945 మధ్యకాలములో యేల్నాటి శని రాజాజీగారిని యెలా బాధించినది అందరకు తెలియునుకదా

మొన్న వారము రోజులపాటు నామక మంత్రులుగా పని చేసిన 8 మంది ప్రమాణ స్వీకారము ముహూర్తరాశి చక్రము పరిశీలించిన దశము స్థానము ప్రాముఖ్యము విదితము కాగలదు ఈ 8 మంది మంత్రులు తే 11 1 73 ది సాయంత్రము 5గంటలకు మిధున లగ్నములో ప్రమాణ స్వీకారము చేసినారు ఆ సమయములో దశమాధిపతి పతి గురుడు రవి యోగముచే నిర్వీర్యుడైనందున, లగ్నాధిపతి లగ్నమును చూచుటవలన లగ్నము బల యుతమైనను దశమాధిపతి స్థితి వలన వారములు రోజుల మంత్రి పదవులు గోల్పోయినారు

కాన దశమ స్థానము దశమాధిపతిస్థితి విచారించి, ప్రభుత్వములు ప్రమాణ స్వీకారములు చేయవలసియున్నది

—పచ్చిపాల ప్రభాకరరెడ్డి, (కోవూరు)

## పుస్తకాలు

మీరు ది 8—12—72 సంచికలోని స్వీకారంలో 'వెలుగు— వెల్లువ' (లిఖిత మాసపత్రిక) వెల 0 50 పై అని తెలిపారు తేజపూర్ మరియు ప్రాంతీయాంధ్రుల సాహిత్యాభిరుచిని ప్రోత్సహించి పెంపొందించే ప్రధానోద్దేశ్యంలో వెలువడుతున్న యీ పత్రిక సాహితీప్రియులందరికీ ఉచితంగా పంపబడుతుంది. ఈ విషయాన్ని పాఠకులకు తెలుపవలసిందిగా మనవి

ఆర్గనైజర్స్, వెలుగు వెల్లువ (లిఖితమాసపత్రిక)
కేరాఫ్ శ్రీ నందేశ్వర్‌భుయాన్, కమార్ చుబూరి,
తేజపూర్ (పోస్ట్), (అస్సాం).

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press & 7 Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Editor. S. Radhakrishna.



'దేశోద్ధారకులు'లో రామారావు.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



దీప్తి ఇంటర్‌నేషనల్

# దేశోద్ధారకులు

ఈస్ట్మన్ కలర్

నిర్మాత: U. విశ్వేశ్వరరావు, B.Sc; దర్శకత్వం: C.S. రావు, B.A. (Litt)

సంగీతం: K.V. మహదేవన్, కెమెరా: G.K. రాము, కళ: S. కృష్ణారావు

ఆంధ్ర: విజయా

VIJAYA